సోమనాథరావు, ఆదిపూడి

శ్రీకృష్ణదేవరాయచరిత్రము

చెన్నపురి, 1907

Record no. 790

Sōmanātharāvu, Ādipūḍi

Śrīkṛṣṇadēvarāyacaritramu

Cennapuri, 1907

Record no. 790

సోమనాథరావు, ఆదిపూడి, 1872-1941.
శ్రీకృష్ణదేవరాయచరిత్రము : పద్యకావ్యము / ఆదిపూడి సోమనాథరావుచే రచియింపబడినది. - చెన్నపురి : ఆనంద స్టీం ముద్రాక్షరశాల, 1907.
ii, 128 p. ;18 cm.
Record no. 790

Sōmanātharāvu, Ādipūḍi, 1872-1941.
Śrīkṛṣṇadēvarāyacaritramu : padyakāvyamu / Ādipūḍi Sōmanātharāvucē raciyimpabaḍinadi. - Cennapuri : Ānanda sṭīṃ Mudrākṣaraśāla, 1907.
ii, 128 p. ;18 cm.
Record no. 790

THE LIFE OF

# Sree Krishna Devarayalu

**( In Telugu Verse.**

# శ్రీ కృష్ణదేవరాయ చరిత్రము.

పద్యకావ్యము.



A Somanadha Rao.

ఆదిపూడి – సోమనాథరావుచే

రచి[illegible]డిన.

చెన్నపురి:

ఆనంద స్టీం ముద్రాక్షరశాల

**1907.**



వెల. 1-0-0]




దీనిలోనుండు శ్రీకృష్ణదేవరాయల పటము, మ-రా-రా

సూర్యనారాయణరావుగారి "Never To Be Forgotten Empi

అను పుస్తకములో ముద్రించిన పటము ననుసరించి నా మి

లును చిత్రకళావిశారదులు నగు మ-రా-రా-శ్రీ సత్యాలయ

గారిచే వ్రాయబడినది.

ఆ.



కావ్యము ఎక్కువ చిరస్థాయియగు కారణముచేతను నాకా సార్వభౌమునియందుగల పరమాదరముచేతను ముఖ్యముగ నా మిత్రులును మునగాల జమీన్దారుల దివానుగనగు మ-రా-రా-శ్రీ, కె. వి. లక్ష్మణరావుపంతులు, ఎం. ఏ. గారి ప్రోత్సాహముచేతను అంతకంటె నతిశయమైన విద్వత్పోషకులును మునగాల జమీన్దారులు నగు శ్రీరాజా నాయని వేంకటరంగారావు బహద్దరుగారి ప్రేరణప్రోత్సాహములచేతను ఈచిన్నకావ్యమును రచించినాఁడను.

ఆంధ్రభాషాపోషకులగు, రాయబహద్దరు వీరేశలింగము పంతులుగారు, మహామహోపాధ్యాయ కొక్కొండ-వేంకటరత్నము పంతులుగారు, మ-రా-రా-శ్రీ,వడ్డాది సుబ్బరాయఁడుగారు, బ్రహ్మశ్రీ, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు,రాజా భుజంగరావ్ బహద్దరుగారు, బ్రహ్మశ్రీ, తిరుపతివేంకటశాస్త్రులుగారు మొదలగు కవిచంద్రులగణముతో నిట్టికార్యంబునకు సాహసించినందులకై నన్ను మన్నించి, యీకావ్యమందలి దోషపుంజంబులను దృణీకరించి, తన సుగుణాళింపదచే నాంధ్రలోకంబునకంతకును మధ్యాందిన మార్తాండునివలెఁ ప్రకాశించుచుండు శ్రీకృష్ణదేవరాయల పవిత్ర చరిత్రయందు మాత్రమే తమమనస్సులను నెలకొల్పఁగలందులకుఁ జనవరులను మిక్కిలి వినయముతోఁ బ్రార్థించుచున్నాఁడను.

ఆ. సోమనాథరావు.



# విన్నపము.

ఆర్యావర్తమందలి యొక్కొక్క మండలమునే నిరాఘాటముగ ముంచుకొని వచ్చుచుండిన తురుష్క ధాటీ ప్రవాహమునకు నడ్డకట్టగ నిల్చి దక్షిణమందు 250 సంవత్సరము లొక్కటేతీరున పోరాడిన విజయనగరసామ్రాజ్యము ఏ సార్వభౌముని సత్పరిపాలనమున మహోన్నత్యము వహించి మించెనో యాకృష్ణదేవరాయల సచ్చారిత్రమును శ్రీకృష్ణరాయవిజయ మను పేర నొక కావ్యరత్నంబొనర్చి కుమారధూర్జటిగారు కవిమండలములో సజరామరకీర్తికలాకలాపులై మెఱయుచున్నవారు. కాని వారికాలములో గృష్ణదేవరాయలను గురించి విస్తారముగ దెలిసియుండలేదు. ఇప్పుడన్ననో ఉండుచుమించుగా గృష్ణదేవరాయలతో సమకాలికులుగనుండిన 'న్యూనిజ్' 'పేజ్' అను పోర్చుగీసు చరిత్రకారులు విపులముగ వ్రాసియుంచిన యంశములనుగొని మిక్కిలి పరిశ్రమచేసి బళ్లారిజిల్లా కలెక్టరుగానుండిన సూయల్ దొరగారు 'విస్మృతసామ్రాజ్యము' అను పేర సామాన్యముగ విజయనగర చరిత్రను విశేషముగ శ్రీకృష్ణదేవరాయల చరిత్రను ఆంగ్లభాషలో వ్రాసి మనలనందఱిని గృతజ్ఞతాబద్ధులుగ జేసియున్నారు. ఈగ్రంథమును బట్టి తేటతెనుగుమాటలతో ఆబాలవృద్ధులకు దెలియునట్లు జీర్ణకర్ణాటరాజ్య మను పేర మ-రా-రా-శ్రీ చిలుకూరు-వీరభద్రరావుగారు కృష్ణదేవరాయల చరిత్రను వ్రాసి మనకందఱికిని మిక్కిలి యుపకారము చేసియున్నారు. కాని పద్య



శ్రీ కృష్ణ దేవ రాయలు.

శ్రీ

# కృష్ణదేవరాయచరిత్రము.

## ప్రథమాశ్వాసము.



శ్రీయుతవిశ్వమేదినిఁ బని ♦ చిన్మయశక్తికిఁ జిత్రచిహ్నామో
న్యాయముఁ గ్రేఁచుచేఁ బ్రభున ♦ నారతముందలపించుచున్న వై
ధ్యేయుఁడ దేమహానుభావుఁడో ♦ దేవసురేశ్వర కోటికాజగ
న్నాయకుఁడో మతిఁ గృపను ♦ నాయని వేంకటరంగరాయనిఁ

### ప్రస్తావన.

అని బుధజననికరంబు నిరంతరంబుఁ దన్ను దీవించుచుండ సుగుణగణవిభూషితుండై చెలువొందుచుండు నమ్మనగాల భూమండలాఖండలుండు. 2

సాగరునకు సహాయసేఁ ♦ సాగరంబౌకప్రక్కఁ
జక్కనిమిణారాల ♦ మొక్కచక్కి
నతులఫలపుష్పమా ♦ పఙ్క్త్యాళియొకచోటఁ
నొకబహిర్భాగది ♦ యొక్కవంకఁ
బ్రజలు వేడుకఁ గూడు ♦ బాగతి యొకచెంత
మోగ్యమౌ గోల్కొండ ♦ యొక్కదండ
మోదావహాముఖతే ♦ మైదాన మొకదిక్కు
నిక్కెడుచార్మినా ♦ రొక్కచాయఁ

*

గలిగిమీర్మహబూబలీ ♦ ఖాన్ మహీంద్రు
పాలనంబునసకలసౌ ♦ భాగ్యగరిమ
నందిచెన్నాందుభాగ్య మ♦హాపురంబు
వచ్చిసత్కార్యములఁ బ్రొద్దు పుచ్చుచుండ. 3

చ. సురపతికెప్పుడున్ హితము♦సూపుబృహస్పతి మాడ్కి నెమ్మితి
మ్మరసినమంత్రిసత్తముని♦యాత్మజుఁడై తనబాల్యమిత్రుఁడై
సరసకళావిచక్షణత ♦ సత్యమెమాటి… ధసేయుచుం
బరగెడులక్ష్మణార్యుఁడొక♦నాఁడిటుపల్కెను జాలిపుట్టగన్. 4

ఉ. అచ్చతెనుంగుకబ్బమున ♦ కాదిపదంబయి పొల్చుభాగ్యమున్
హెచ్చుగఁగన్నదేశమిది ♦ యేదురదృష్టమొ యాంధ్రభాషనేఁ
డిచ్చటనింపుసొంపుచెడి ♦ హీనదశార్తినిఁ గుందెనక్కటా
యచ్చపుటాంధ్రపుత్రులకు ♦నందఱికిన్ దలవంపులౌనటుల్. 5

సీ. రాజరాజనరేంద్రు ♦ రక్షణంబునఁగదా
తేజరిల్లెనుమహిఁ ♦ దెనుఁగుబాస
మనుమసిద్ధిమహీశు ♦ మాటుననేకదా
యందమంది తెలంగె ♦ నంధ్రభాష
మొనమొన్న …ష్ణరా ♦ యనికృపచేఁగదా
మినుముట్టఁబొంగెనీ ♦ మేలిబాస
యిపుడేనిసీబోటి ♦ నృపులు దేర్చినఁగదా
దీనతఁబాయునీ ♦ దేశభాష
గానదేశాభిమానస ♦ మ్మాననీయ
…ఘనచరిత్రనీప్రాపుఁ ♦ బడయఁగోరి



వేచియున్నదివేయేల ♦ విడువఁబోకు
కూర్మినేలినసుఖములు ♦ గూర్చునీకు. 6

గీ. అనుడుఁగనికరమెదనిండ ♦ నవనివిభుఁడు
మిత్రువదనంబువీక్షించి ♦ మించుప్రేమ
నోసఖ యంధ్ర ♦ మేరీతినుద్ధరింప
నగునుదెల్పవెయనినాతఁ ♦ డలరిపల్కె. 7

క. రాజవునీహృత్పద్మ
భ్రాజితమిఁకఁగానసంధ్ర ♦ భాషేందిరఁ దాఁ
దేజమెలర్చెడునీకర
రాజీవముశరణుగన్న ♦ రాజ్యరమవలెన్. 8

గీ. ఆంధ్రభోజుఁడనఁగ ♦ నతిప్రశస్తంబైన
కీర్తిఁగన్నయట్టి ♦ కృష్ణదేవ
రాయుపేరనాంధ్ర ♦ రమణీయపుస్తక
శాలనేర్పరింపఁ ♦ జనునృపాల. 9

మత్తకోకిల.

అందఱచ్చటఁ బుస్తకంబుల ♦ హాయిగాఁ బఠియించుచున్
సందియంబులు వాయునట్లుగ ♦ సభ్యభాషణసల్పుచున్
నిందనీయములెల్ల వీడుచు ♦ నీతిఁబ్రీతినిఁజూపుచున్
డెందమందుముదంబుగూర్తురు ♦ తెల్గుబాసనుబ్రోచుచున్. 10

క. నావుషుఁబ్లవసంవత్సర
శ్రావణబహుళంపుతదియ ♦ రవివారంబౌ

భూవరుఁడు పాలవంచపు
భూవిభుచేఁ దెలియఁజేసెఁ ♦ బుస్తకశాలల్. 11

వ. ఇట్లు కవిరాజకంఠీరవుండగు శ్రీకృష్ణదేవరాయల స్మారకచిహ్నంబుగఁ బుస్తక భాండాగారంబు భాగ్యపురంబునఁ బ్రతిష్ఠింపించి యాంధ్రులకుఁ బ్రోత్సాహంబుగల్పించి యమ్మునగాల ధరావల్లభుండు. 12

గీ. కృష్ణరాజేంద్రుచరితను ♦ తత్కృష్టఫణితి
వ్రాసెసూయలుదారయాంగ్ల ♦ భాషలోనఁ
దనదువిస్మృతసామ్రాజ్య ♦ మనెడిపుస్త
కమ్మునందనివినిదానిఁ ♦ గాంచిపొదలి. 13

క. ననుధన్యుఁ జేయుకోరిక
మనమునఁ గడలుకొననొక్క ♦ మధుమాసపుస
ద్దినమునఁ బ్రభాతభోజన
మొనరించిన పదపమిగుల ♦ నుత్సాహముతోన్. 14

ఉ. చిత్రవిచిత్రపీఠములఁ ♦ జెన్నలరారు గృహాంతరంబునన్
మిత్రులఁగూడియుండినను ♦ మిక్కిలిగోమునఁ జేరఁజీరియో
మిత్రమమూరిరాయరకు ♦ మించినగండనికృష్ణరాయచా
రిత్రము నందతెనెడు ♦ రీతిరచింపవె కీర్తినింపవే. 15

వ. అని బహుమాన పురస్సరంబుగ నాదరించి కప్పురంపు విడియంబొసంగినఁ దత్సమయ సంజనిత హర్షావేశంబునం గలిగిన గర్వాతిరేకంబున బాల్యబుద్ధిచే నక్కఁడింది కార్యంబు నకుంగడంగ నంగీకరించి సెలవుపడసి గృహంబుం జేరి. 16



గీ. కావ్యరచనకుఁ గడఁగిన ♦ కాలమందుఁ
గైతలోనుండుకష్టమా ♦ కారమెత్తి
పనులఁగట్టినయట్టులు ♦ గానుపింప
గౌరవించితిమదిని సత్కవులనెల్ల. 17

వ. ఇట్లు కావ్యంబు రచించుట సులభకార్యంబని తలపోసి యారంభించి తుదముట్టు తెఱంగెఱుంగక విచారదందహ్యమానమానసుండనై ముందు వెనుక దోఁచక యాపద్బాంధవుండగు నప్పరమేశ్వరుని హృదయంబునం గీలుకొల్పి.

క. తిక్కనపైఁ జిలికినదయఁ
జక్కఁగ నామీఁదఁ గురియ సను యము దేవా
తక్కిననిక్కము సేగికిఁ
జిక్కెదనార్తార్తిహరణ ♦ సేవకభరణా. 19

ఉ. బమ్మెరపోతరాజునకు ♦ భవ్యకవిత్వమహత్త్వసంపదన్
సమ్మతినిచ్చిప్రోచితివి ♦ చారుకృపామతి నేఁడు నన్ను నీ
విమ్మెయిపీడగాఁదగునె ♦ యీశ్వరభక్తహృదబ్జభాస్కరా
నమ్మిననన్ను నీదయను ♦ నాథునిఁ జేయవె సోమనాథునిన్. 20

వ. అని దీనవత్సలుండగు నప్పరమపురుషుని శరణంబు వేడినఁ దత్క్షణంబ యక్కరుణాపయోధరంబు ప్రసాదించిన ధైర్యాసారంబున వీతవిచారుండనై కావ్యరచనకుం గడంగి తొలుదొల్తఁ గృతిపతి వంశంబించుక యభివర్ణించెద. 21

(కృతిపతివంశానుక్రమణిక.)

ఉ. అడ్డములేనిపౌరుషము ♦ యాచకవృత్తి బుధానురాగమే
ర్పడ్డగుణంబులై తనర ♦ భవ్యపరాత్పరభక్తియుక్తిమై
బిడ్డలఁబోలె గోవులను ♦ బీదలసాదులఁ బ్రోచుచున్ భువిన్
రెడ్డికులంబుభూవరుల ♦ రీతినినీతినిఁ బ్రీతిఁ జూపెడున్. 22

ఉ. అక్కులకల్పభూజసుమ ♦ మైతనకీర్తినితాంతసౌరభం
బెక్కుడఁజూచినన్వాలయ ♦ హెచ్చుగదానమరందధారనల్
దిక్కులయాచకాళికుతిఁ ♦ దీరిచియుత్తమచిత్తమార్దవం
బక్కజమైచెలఁగగనఁ ♦ రారెనునాయనియయ్యవారిలన్. 23

చ. అతులతపఃఫలంబనఁగ ♦ నాతనికిజ్జనియించిరామభూ
పతియతిధైర్యశౌర్యములఁ ♦ బల్మరుదుష్టులశిక్షసేయుచున్
సతతముశిష్టరక్షణయె ♦ చారువిభూషణమైయెలర్పఁగా
క్షితిఁదనరారెనావిమల ♦ శీలుఁడుసార్థకనామధేయుఁడై. 24

క. ఆరామభూమిపతికృ
ష్ణారెడ్డినిబడసైనతఁడు ♦ సత్యప్రియుఁడై
భూరిపరాక్రమకీర్తులఁ
దారవిచంద్రులకు లజ్జఁ ♦ దలకొల్పెభువిన్. 25

శా. శ్రీకృష్ణక్షితిపాలచంద్రునకునా ♦ హ్లాదంబుసంధిల్లను
శ్లోకాలంకృతుఁడైనృసింహపృథివీ ♦ శుండుద్భవంబొందిల
క్ష్మీకాంతామణిచెట్టపట్టివిలస ♦ త్కీర్తింబ్రకాశించెదన్
లోకుల్మెచ్చఁగవైరిలోకములులో ♦ లోఁగ్రుంగిలోపింపఁగన్

ఉ. ఆనరసింహభూపతికి ♦ నాతనిదేవికిదత్తపుత్రుఁడై
దీనజనావనైకగుణ ♦ ధీరుఁడువేంకటరామభూవరుం
డూనెప్రజాభిరంజనమ ♦ హోత్తమకార్యముదాత్తచిత్తుఁడై



దానలసత్ప్రవాహముల ♦ ధారుణిసజ్జనపాళిఁబ్రోచుచున్. 27

గీ. ఆధరాపాలతిలకున ♦ కమలసౌఖ్య
నామకేసరకోదండ ♦ రామపుత్రి
లలితసద్గుణనికురుంబ ♦ లచ్చమాంబ
రాణియయ్యెనుమునగాల ♦ రాజ్యమయ్యె. 28

గీ. మఱియునద్ధరణీశున ♦ మాత్యపదవి
విమలయశుఁడుకోమట్రాజు ♦ వేంకటప్ప
యందిసర్వవిధంబుల ♦ నరయుచుండ
రాజ్యమంతయుశ్రీరాను ♦ రాజ్యమయ్యె. 29

వ. అంత. 30

ఉ. వేంకటరామభూపతికి ♦ వేడ్కమెయిన్ సతిలచ్చమాంబకున్
వేంకటరంగరాయపృథి ♦ వీపతిదత్తకుమారుఁడైకడున్
బొంకముగాధరాజనులఁ ♦ బోషణసేయుచు వైరివారమున్
బింకముతోవశీకృతుల ♦ వేనొనరించుచు నుండుశేముషీన్. 31

వ. మఱియును. 32

ఉ. కంటినితెప్పవోలెఁదముఁ ♦ గాచినమంత్రికి వేంకటప్పకున్
బంటగఁబండినట్టిప్రతి ♦ భాయుతుఁబట్టపదప్రకాశితున్
దొంటికృతంబులోఁదలఁచి ♦ తోడ్పడులక్ష్మణరాయుధార్మికున్
గెంటనిప్రేమసీవిషఁడు ♦ నేస్తునమాత్యునొనర్చియొప్పెడున్.

సీ. ఇమ్మహీపాలుండు ♦ హితహర్షలోలుండు
బుధజనావనకళా ♦ భూషితుండు
దీనమందారుండు ♦ ధృతమహోత్సాహుండు

పావనచారిత్ర • పండితుండు
మందస్మితాస్యుండు • మధురవచస్కుండు
బాంధవహృత్పద్మ • భాస్కరుండు
పరసతీవిముఖుండు • భవ్యస్వభావుండు
దేశభక్తవ్రాత • దృఢసఖుండు
సతతవిద్యాసమర్పిత • సద్ధనుండు
వరదయాపూరితస్వాంత • సరసిజుండు
న్యాయజేగీయమానమ • హాయశుండు
విమలనాయనికులవార్ధి • హిమకరుండు. 34

గీ. ఇట్టిగుణములనలరు నృ • పేంద్రుఁడమల
చరితబుచ్చమదేవిని • జారుమతిని
ధర్మవిధిఁబెండ్లియాడిత • ద్గర్భజలధిఁ
బడసెలక్ష్మమ్మయనుసుతన్ • భాగ్యవతిని. 35

ఉ. పిమ్మటఁగాంచెనావిభుఁడు • ప్రేయసియుల్లము పల్లవింపఁగా
నెమ్మదిసమ్ముదమ్మొదవ • నీరజమిత్రతులనవ్యస్వీయవం
శమ్ముపవిత్రపాత్రముగ • సల్పెడుచిన్నెలుముద్దుమోమునన్
జిమ్మెడురామకృష్ణుఁడను • చిన్నికొమారుని శ్రీకుమారునిన్.

క. ఆపిదపఁగనియెగుణముల
ద్వాపరకృష్ణునకుఁబోల్పఁ • దగినతనయునిన్
గోపాలకృష్ణనాముని
భూపాలకలక్షణములఁ • బొల్పుకులమణిన్ 37



క. తరువాతమరలఁగాంచెన్
సురుచిరసుమగాత్రఁబరమ • సుందరనేత్రన్
సరళానామకపుత్రిన్
సరళమనోజ్ఞస్వభావ • సద్గిరిపుత్రిన్. 38

వ. ఇట్లు సతీసుతామాత్య బంధుమిత్రపరివారసమేతుండై వివిధ విభవంబుల విలసిల్లుచు నడిగూడెంబు రాజధానిగమునగాల రాజ్యంబు సమగ్రంబుగఁ బరిపాలించుచు నాయనికులకలశార్ణవంబునకుఁబరిపూర్ణచంద్రుఁడై ప్రకాశించు శ్రీవేంకటరంగరాయ మహీంద్రుని శాశ్వతకీర్తికి నాలవాలంబుగనే నపారకరుణారససాగరుండగు పరమేశ్వరుని కృపాకటాక్షంబున శ్రీకృష్ణదేవరాయచరిత్రంబు పద్యకావ్యంబుగ రచియించి యక్కృతిపతికి వినిపించిన తెఱంగెట్టిదనిన. 39

---

# కృష్ణదేవరాయ చరిత్రము.

## కథాప్రారంభము.



శ్రీ వర్ధిల్లగ సతతము
వేవిధములఁ బ్రజలఁగాచు ♦ విమలచరిత్రా
దేవప్రసాదపాత్రా
శ్రీవేంకటరామరాట్ప్ర ♦ సిద్ధసుపుత్రా. 40

వ. అవధరింపుము. 41

ఉ. తుంగతరంగమాలికల ♦ తోఁదులఁదూఁగెడు తుంగభద్రతోన్
సంగతిసేయఁగాఁ దొడఁగి ♦ సాగరుఁడందిన రూపనంగను
త్తుంగపుసౌధవీథికల ♦ తోమినుముట్టఁగఁ బొంగియాతటి
న్యంగమునంటిపొల్చువిజ ♦ యాఖ్యపురంబుకరంబుడంబుతోన్

సీ. శృంగశోభితగంధ ♦ సింధురంబులతోడ
సంశిక్షితతురంగ ♦ సమితితోడఁ
బటుశతఘ్నీయుత ♦ ప్రాకారములతోడ
వెఱపెఱుంగనివీర ♦ వితతితోడఁ
విస్తారవీథికా ♦ విపణిపఙ్క్తులతోడఁ
చారుపుష్పోద్యాన ♦ చయముతోడ
సైనికసంచార ♦ సనుభూమికలతోడ
రమణీయకాసార ♦ రాజితోడ
గిరివరతరంగిణీమణి ♦ పరిసరంపు
సొంపుచేసంభవించిన ♦ పెంపుతోడ



వెలయునాపురివింతల ♦ కింతయగుచు
రసికకవిబుధవరనిక ♦ రంబుతోడ. 43

ఉ. మాలిమిసేయనేర్పుగల ♦ మావటులుఁగడు పారమేపఁ బ్రబ్బల్
మాలనిపాలకుల్ మఱిప్ర ♦ మాదము వొందక చూచునాయకుల్
పాలనసేయమత్తగజ ♦ వారము వారణశాలలోపలన్
గ్రాలును ఘీంకృతుల్ దెసలఁ ♦ గ్రమ్మి ప్రతిధ్వనులీనుచుండఁగాన్

గీ. పైడికట్టులదంతము ♦ లిభదలిర్ప
కాళ్లబంగారు గొలుసులఁ ♦ గాంతిదనరఁ
మీఁదఁబీతాంబరము లొప్ప ♦ మించుకరులు
వెడలుగంటల ఠంఠణల్ ♦ వీథిసేయ. 45

చ. నిగనిగ లొల్కఁదోమినడ ♦ నేర్పుసుఖంబుగ మేపఁగ్రీవముల్
సొగసుగవంచిబల్ బెదరు ♦ చూపులఁజూచిఖురంబుఁ గొట్టిసొం
పుగసకలించు గుఱ్ఱముల ♦ పొల్పదిదెల్పఁగ శక్యమానె బా
గుగఁగనినట్టి వారలకె ♦ గోచరమన్యులకేల తోఁచెదుర్న్. 46

గీ. వాగెపక్కెరమే లంక ♦ వన్నెలమర
భూరి మణిమండనమ్ములఁ ♦ బొలుపుగాంచి
సైంధవారట్ట బాహ్లికా ♦ శ్వమ్ములచట
వివిధధారావినోదముల్ ♦ వేడ్కఁజూపు. 47

చ. బురుజులపై ఫిరంగిగమి ♦ భూరిమృగేంద్ర భయంకరాకృతిం
బరగనగడ్త పూర్ణజల ♦ భాసితమై తనుఁజుట్టి కొల్వఁబెం
దురములఁ దేరినట్టిరణ ♦ ధూర్వహులెప్పుడుఁ గాచుచుండన
వ్వరపురదుర్గ మొప్పరిపు ♦ వర్గముపాలికి దుర్గమంబుగాన్. 43

ఉ. ఘోరరణాంగణమ్మునన ♦ కుంఠితవైరివిదారణంబునన్
దేరినవీరవారములు ♦ దీర్ఘపరాక్రమ రేఖశోభిలన్
బౌరవిభూషణంబులయి ♦ భాసిలుచుందురు పట్టణంబునన్
వీరరసంపు మూర్తులని ♦ విశ్వమువిస్మయమంది చూడఁగన్

చ. ఇరుదెసనొక్క తీరువహి ♦ యించిన సౌధనికాయపఙ్క్తితోఁ
బరిసరులజ్జనుల్దిరుగఁ ♦ బన్నిన సుందరసత్పథాళితోఁ
గరిరథఘోటకప్రకర ♦ ఘట్టనకుందగు నేలకట్టుతోఁ
గరమలరారు వీథికలు ♦ గన్గొనువారలు మెచ్చురీతితోన్. 50

చ. ఇలఁగల మేలివస్తువుల ♦ కెల్లనిదానములైన యంగడుల్
కలుముల యాలవాలములు ♦ గల్లకుదూరులు నౌవిహారులా
నిలయమునందుఁ గల్గసుఖ ♦ నీరధిదోఁగి జనుల్యథార్థముల్
బలుకఁగఁజొచ్చిరెచ్చటను ♦ భవ్యులసంగతిబాగుసేయదే. 51

సీ. కమ్మనివాసనల్ ♦ గ్రమ్ముపుష్పమ్ములు
పరమేశుశక్తిని ♦ బాడుచుండుఁ
బక్వఫలంబుల ♦ పరమమాధుర్యంబు
దేవునిమహిమఁగీ ♦ ర్తించుచుండుఁ
దరులశాఖలనుండి ♦ తరలుచల్లనిగాలి
యీశ్వరుకరుణఁగీ ♦ ర్తించుచుండు
వృక్షపఙ్క్తులక్రింది ♦ యక్షయచ్ఛాయలు
మోక్షసామ్రాజ్యమ్ము ♦ బ్రోయుచుండుఁ
దనివితీరకయుద్యాన ♦ వనములెల్ల
సకలసుమఫలపవనస ♦ చ్ఛాయలందు



నందతికిఁదెలియవచ్చెడు ♦ నందమందు
సారెసారెకు భగవంతుఁ ♦ జాటుచుండు 52

ఉ. సంగరశిక్షకోత్తములు ♦ సాంగముగాఁదమనేర్పుమీఱమా
తంగతురంగసద్భటశ ♦ తంబులకున్ సమరప్రకారముల్
రంగములందు నేరిపెడు ♦ రంగుగనుంగొనిభీరులుంగడుం
బొంగిరణాంగణంబునకుఁ ♦ బోవఁగడంగుచునుందురప్పురిన్.

ఉ. ఎన్నియొచంద్రమండలము ♦ లెందఱొసూర్యులుమింటవెల్గు [చో
నెన్నకయొక్కటొక్కటని ♦ యెంచెడివారలభ్రాంతిఁబాపఁగాఁ
దిన్నగనింగియొక్కప్రతి ♦ దీసినచందమునన్ సరోవరాల్
చెన్నగుపుండరీకములఁ ♦ జెందొవలన్ గనువిందుసేయుచున్॥

శా. నానానూనఫలప్రసూనతరుసం ♦ తానప్రతానంబులన్
బానస్నానవిధానయోగ్యగుణసం ♦ పన్నాంబుకూపంబులన్
మౌనిధ్యానసుహానుకూల ♦ కుహరీ మాన్యప్రదేశంబులన్
దానాతిథ్యము హేమకూటమొసఁగున్ ♦ ధర్మంబటన్ జాటు
చున్. [55

ఉ. పానముపీటివారలకుఁ ♦ బ్రాణముకోటకుసోనతోటకున్
మానముకృష్ణకున్ మఱిప్ర ♦ మాణముభద్రకుఁగానఁదుంగభ
ద్రానదికేదిసాటిమన ♦ దాయలకుంశతకోటియుంచుస
న్మానముతోడనాగరులు ♦ మానసముంబుగఁజాతురానదిన్.

చ. నవరసముల్దలంపఁగనె ♦ నాట్యముసల్పుచువచ్చిచెచ్చెరన్
గవనమునందుఁజొచ్చివర ♦ కావ్యకళాభరణంబొనర్చిగా

రవముగ నంగఁ జేయఁగల ♦ రవ్యమృదూత్తమధాటిఁ దేజిస
త్కవులు సభాస్థలిన్ సరస ♦ ధామ మొనర్చుచునుందు రచ్చటన్

ఉ. సారవిచారమున్ సకల ♦ శాస్త్రవిహారము వేదచోదితా
చారము సర్వసద్గుణప్ర ♦ చారము ధర్మముగా బుధాళి సం
సారులశ్లోకలం దొలఁచి ♦ సారెకు సౌఖ్యము గూర్చు కోర్కెసం
చారము చేయుచుందురు వి ♦ చారము దక్కి పురంబులోపలన్

వ. మఱియుఁ దరణికిరణ తిరస్కరణ శోభాసందీప్యచ్ఛాతకుంభ కుంభ వరిశోభితాభ్రంకష సముత్తుంగ విచిత్రగోపురాలంకృతవిశాలదివ్యదేవాలయ రాజివిరాజితంబును, విలోకనకుతూహలసమాగత విదేశవిద్వద్బృంద సంస్తూయమానానూన శిల్పవైభవ విభ్రాజమాన మహాభవనాభిరామంబును, అనర్ఘ చంద్రకాంత గజదంతరజత మహారచిత జిరత్న రత్న ఖచిత నేత్రపర్వాపూర్వ వివిధపదార్థరామణీయకోల్లసిత రాజహర్మ్యాళిమండితంబును, సార్వభౌమసందర్శనార్థ నిరంతరయాతాయాత సామంతభూభృన్మహా చతురంగసేనాసందోహ హళాహళిత రాజమార్గ ప్రకాశితంబును, నిగమాగమదర్శనాది నానావిధ విజ్ఞాన నిదానగురు జనసమాకర్షిత శిష్యగణోపేత విద్యానికేతన వ్రాత విభాసితంబును, ప్రాజ్యసంపూర్ణ కర్ణాట రాజ్యలక్ష్మీనివాసంబును, సకల సంభార పరిపూరితంబును, చిత్రప్రాకారపరివేష్టిత వప్రంబును, సర్వోత్తమ పురీవతంసనిదర్శనంబును నై హస్తినావతి పంపాక్షేత్ర రాయపట్టణ జయపుర విద్యానగరాది పర్యాయనామంబులచే సుప్రసిద్ధంబై సపాదయోజన దీర్ఘంబును, యోజన విస్తృతంబును, పంచయోజన వృత్తంబునుం గలిగి యొప్పు న వ్విజయనగర నగరీలలామంబునందు. 59



శా. బాహాదగ్ర పరాక్రమక్రమకళా ♦ పారీణతన్ సర్వస
న్నాహోద్భాసితవైరివీరచయమున్ ♦ సంగ్రామరంగంబునన్
ద్రాహిత్రాహి యనంగ నోర్చి భువిసాం ♦ ద్రస్ఫారకీర్తిచ్ఛటల్
బాహుళ్యంబుగఁ జల్లి చంద్రకులసౌ ♦ భాగ్యంబు రంజిల్లెడున్.

ఉ. దక్షిణమందు మ్లేచ్ఛలతి ♦ దక్షతఁ జూపఁగ నార్యరక్షకై
పక్షముఁ బూని యచ్చట వి ♦ పక్షకులక్షయవృత్తికేడ్తెఱన్
దీక్ష వహించి చంద్రకుల ♦ దీప్తికి దీధితి వెట్టి పొల్చె హ
ర్యక్షపరాక్రమంబు తుళు ♦ వాన్వయ మార్తులఁ బ్రోచు మూర్తియై

ఉ. అత్తుళువాన్వయాంబుజవ ♦ నాళికహేళిగ మ్లేచ్ఛజాతియున్
మత్తగజౌఘమున్ గవిసి ♦ మార్కొను సింహముగా బుధార్థమా
యత్తపవిత్రకోశముగ ♦ నార్తులపాలిటి యాప్తమూర్తిగా
నుత్తమ భాగ్యశాలి నర ♦ సోర్విపుఁ డుద్భవమంది వర్ధిలెన్. 62

చ. అతులపరాక్రముండతఁ డ ♦ హర్నిశమున్ బుధేంద్రమండలీ
వృతుఁడయి రాజధర్మము వి ♦ వేచన సేయుచు లోకులన్ సదా
వితరణశాలియై మనిచి ♦ వీరరణోత్సవక్రీడలన్ మహో
ధృతమతియై చెలంగి కడు ♦ దీర్ఘము కన్నడ మేలెలీలగాన్. 63

ఉ. అద్ధరణీశుఁ డాదశర ♦ థావనిపాలుని మాడ్కి ముగ్వురన్
శుద్ధచరిత్రలన్ బరమ ♦ సుందరగాత్రల నైకమత్యసం
బద్ధలఁ దిప్పమాంబ ప్రతి ♦ భావతి నాగమ యోబమాంబలన్

బద్ధమహానురక్తిని వి ♦ వాహవిధిన్ వరియించె వేడుకన్. 64

ఉ. ఆనరసక్షితీశునకు ♦ నాతని దేవికిఁ దిప్పమాంబకున్
భానుఁడు నింగిఁ దూర్పునఁ బ్ర ♦ భావిభవంబునఁ దోఁచుకైవడిన్
దానుదయించి వర్ధిలెను ♦ దారుఁడు వీరనృసింహుఁ డామసల్
మానులమానమంత్రియును ♦ నద్భుమహోత్తమ తేజమే

సీ. ఆర్యగౌరవమున ♦ కాభరణమనంగఁ [ర్పడన్. 65
చంద్రవంశపుకీర్తి ♦ సారమనఁగఁ
ప్రజలకై పుట్టిన ♦ పరమబంధువనంగ
స్వచ్ఛగుణంబుల ♦ గుచ్ఛమనఁగ
మ్లేచ్ఛులపాలింటి ♦ మృత్యురూపమనంగ
విబుధావలంబన ♦ వృక్షమనఁగఁ
గవిచకోరాళికిఁ ♦ గైరవాప్తుఁడనంగఁ
గేవలమభినవ ♦ కృష్ణుఁడనఁగ
అలసరసభూపుపుణ్యంపు ♦ ఫలమనంగ
ధర్మమార్గరతాళికాం ♦ దరువనంగ
భాగ్యశాలికి నాగమాం ♦ బకు జనించె
వీరశ్రీకృష్ణరాయకం ♦ ఠీరవుండు. 66

క. శ్రీయోబమాంబ గాంచెను
గాయజసుందరుల లలిత ♦ కాయుల సుతులన్
శ్రీయుతులగు నచ్యుతభూ
నాయక శ్రీరంగదేవ ♦ నాముల వరుసన్. 67

క. నరసక్షితిపాలునం



తరమున రాజ్యంబు వీర ♦ నరసింహవిభుం
డురుతరప్రతాపకీర్తుల
నరిమర్దనుఁడగుచు నేలె ♦ నార్యులు పొగడన్. 68

వ. ఇట్లు పూజ్యంబుగ రాజ్యంబు సేయుచుండి యవ్వీరనరసింహ దేవరాయ పృథ్వీరమణుండు దనకవసానకాలం బాసన్నం బగుడుఁ దనయనంతరం బష్టశరద్వయస్కుండగు తనపుత్ర త్నంబునకు రత్నగర్భాధిరాజ్యం బలవడుట కష్టసాధ్యంబని యెంచి తనకు సర్వవిధంబుల సహాయుండును బరమవిధే యుండును దమ్ముండు నగు శ్రీకృష్ణదేవరాయలయెడ ననూ యాపరుండై మంత్రిపుంగవుండగు తిమ్మరసుఁ జేరంజీరి తనకు నయ్యావరజుని నేత్రంబులం దెచ్చి సమర్పించినఁగాని శాం తంబుగఁ బ్రాణంబుల విడువంజాలనని నుడివిన నయ్యమా త్యశేఖరుం డక్కార్యంబుచే రాజ్యభారనిర్వహణసమర్థుం డును, అసహాయశూరుండును, సుగుణగణాలంకృతుండును, సర్వజనసమ్మాన్యుండును నగు శ్రీకృష్ణదేవరాయలకుం గీడొ నరించి ప్రశస్త విజయనగరరాజ్యంబు నపాయసముద్రంబు నం బడఁద్రోయుటకు మనంబొప్పక యవ్వృత్తాంతంబున బ్భూరమణానుజునకు విన్నవించిన యమ్మహనీయుండు. 69

క. కన్నడసామ్రాజ్యశ్రీ
కెన్నడు మదిఁ గీడుఁ దలఁచి ♦ యెఱుఁగని నాపైఁ
గన్నడపతి మాయన్నకుఁ
జన్నె సంశయము పూన ♦ సచివోత్తంసా. 70

క. దుర్జ్యేష్ఠ భ్రాతృపుత్రుఁడై
రాజ్యంబేలంగనిమ్ము ♦ రాతిచయమ్ముల్
త్యాజ్యమ్ములు గానిమ్మను
భోజ్యముగానిమ్మురాష్ట్ర ♦ భోగములెల్లన్. 71

క. నాయందలి యుపనమ్మక
మాయగ్రజునకును బాయు ♦ నల్లుగనిపుడేఁ
బోయెదసన్న్యాసముగొని
తీయగనే లామదీయ ♦ దివ్యాంబరముల్. 72

గీ. అట్లుకాదేనినిదెనాక ♦ రాసిదూసి
గ్రుచ్చియీరెండుకన్నుల ♦ గ్రుడ్లుదీసి
యిత్తుఁబట్టము సందియ ♦ మెల్లఁబాసి
పోవస్వర్లోకమునకున ♦ ప్పుణ్యరాశి. 73

చ. అనియొరఁగత్తిఁదూయుటయు ♦ హాయనిమంత్రికరంబువట్టి
మోమనుజవరేణ్యకన్నడర ♦ మాసతికెన్నఁడుఁ గీడునెంచతే
దనివినిపించియిప్పుడిటు ♦ లక్కట తన్మహనీయభార్గవిన్
ఘనవిపదబ్ధిముంచనిటుఁ ♦ గంకణబద్ధుఁడవౌటపాడియే. 74

గీ. అనుడుదిగ్భ్రమఁజెంది ♦ నృపానుజుండు
చూపులోదైన్యభావంబు ♦ దోఁపసచివు
వదనమీక్షించిగద్గద ♦ స్వనముతోడ
నెద్దిమద్ద్రోహమదినిరూ ♦ పింపుమనియె. 75

క. అంతగదిమ్మర సాగ్రిణి
శాంతముతోనతని వెన్నుఁ ♦ జఱచుచుఁ బృథ్వీ



కాంతానీయగ్రజుపని
శాంతముగాఁజొచ్చె ♦ శత్రు చయములు హెచ్చెన్. 76

క. నీయన్నకొడుకో బాలుఁడు
మాయోపాయములు పన్ని ♦ మనలోఁ గలఁతల్
దాయలు గొల్పఁగఁ జూతురు
నీయత్నములెడలవారి ♦ నేత్రములలరున్. 77

ఉ. ఇత్తఱివైరి సంతమస ♦ మెల్లెడఁబర్వకయుండభాస్కరో
దాత్తపరాక్రమార్భటిస ♦ దాప్రవసించుప్రతాపశీలుఁడ
త్యుత్తమరాజనీతిపరుఁ ♦ డొక్కఁడునీసముఁడున్నఁగానిభూ
పోత్తమరాజ్యలక్ష్మిమన ♦ యొద్దవసింపదుసత్యమెమ్మెయిన్. 78

గీ. కానఁగర్ణాటరాజ్యనౌ ♦ కయదినేఁడు
విపదకూపారమునఁబడి ♦ విలయమంద
కుండశ్రీకృష్ణకర్ణధా ♦ రుండవగుచు
నడిపిసత్కీర్తివడయుమ ♦ నాథనాథ. 79

క జనకునివోల్కిప్రజలకు
జనకుఁడవై విషయములకుఁ ♦ జనక మహాస
జ్జనకల్పకమైతనరుము
జనవరరాజులకునిదియ ♦ సన్న్యాసమనన్. 80

వ. అని యాసచివాగ్రేసరుం డగు నత్తిమరసుండ కృష్ణదేవరాయలం బ్రబోధించి యనంతరంబున నయ్యస్తమించుచున్న వీరనరసింహ దేవరాయల సమీపించి యద్ధరారమణునకు మేమనేత్రంబులం దెప్పించి చూపిన నయ్యవియ

య్యనుజుని నయనంబులే యనుతలంపున నిర్విచారుండై
యమ్మహీవల్లభుండు పరలోక నివాసుండయ్యె. 81

సీ. వీరనృసింహేంద్ర ♦ విభుననంతరమున
వీరాగ్రగణ్యుఁడా ♦ శౌరినిభుఁడు
మందస్మితముఖార ♦ విందుఁడార్ద్రమనస్కుఁ
డమితదృఢోరస్కుఁ ♦ డతిబలుండు
సర్వసర్వంసహా ♦ నిర్వహణాయత్త
భూరిదోర్దండవి ♦ భూషితుండు
శ్రీకృష్ణరాయఁడ ♦ క్షీణప్రతాపుఁడు
వైరిశిక్షణకళా ♦ వైభవుండు
వందిబృందంబు వొగడనా ♦ నందమొంది
బుధులు దీవింపసామంత ♦ భూమిధవులు
గొలువఁబట్టాభిషిక్తుఁడై ♦ కోమరుమిగిలి
దేవపతిమించుఠీవితోఁ ♦ దేజరిల్లె. 82

వ. తదనంతరంబ. 83

గీ. ఆశుభోత్సవసూచక ♦ మై వెలుంగ
హంపిలోనివిరూపాక్షు ♦ నాలయమున
ఘనశిలాస్తంభమండప ♦ మనుపమాన
గగనచుంబితగోపురం ♦ బెగడఁజేసె. 84

వ. అంత. 85

క. అనుజులనగ్రజసూనుని
ననవరతసుఖంబులంది ♦ యలరుచునుండన్



బనిచె వడిఁ జంద్రగిరికిఁ
దనివెనుహృద్బంధుజనులఁ ♦ దగుసత్కృతులన్. 86

ఆ. ఇట్లుశ్రీచంద్రరామవే ♦ దేందుశాలి
వాహనశకంబుసచ్ఛుక్ల ♦ వర్షమాఘ
శుద్ధపక్షచతుర్దశీ ♦ శుభదినమునఁ
గృష్ణభూపతిరాజ్యల ♦ క్ష్మివిగ్రహించి. 87

వ. ప్రత్యహంబును బ్రాహ్మముహూర్తంబున వందిమాగధ పాఠకకైవారంబుల గాయకులసుగానంబుల మేల్కాంచి పరమేశ్వరుని గుణానువాదంబు గావించి యావశ్యకంబులగు ముఖప్రక్షాళనాదికంబు లొనరించి పరిశుద్ధ తైలంబుం ద్రావి యంగమర్దనంబు గావించుకొని దేహమ్మున ధారాళమ్ముగఁ జెమ్మటగ్రమ్మునట్లు వ్యాయామంబొనర్చి కొంతవిశ్రమించి యనంతరంబునఁ బ్రశస్తంబగు నశ్వంబునారోహించి ప్లుతగతిం గోశమాత్రంబుఁ గ్రుమ్మరి క్రమ్మఱంజనుదెంచి పరిమళమిళితకించిదుష్ణశుద్ధోదకంబుల నభ్యంగనం బొనర్చి ధౌతవస్త్రపరిధానుండై దేవాలయంబున కరిగి యారాధనంబుగావించి యర్చకదత్తప్రసాదంబు స్వీకరించి మరల షోడశమహాదానంబు లొనర్చి సుఖభోజనానంతరమ్మున సర్వాభరణభూషితుండై కొలువుకూటంబునఁ బేరోలగంబిచ్చి ప్రజలవిన్నపంబు లాలించి యథాన్యాయంబు గావించుచు సకలకలాక్రీడావినోదంబుల దత్తావధానుండై విద్వత్కవి బుధవర నికరంబుల సన్మానించుచు ననుపమసీమా విభూషి

తుండును ఆర్వేలకులాభరణుండును వైష్ణవసంప్రదాయుం
డును సచివశేఖరుండునగు సాళ్వతిమ్మరసు నందుఁ బూజ్యభా
వంబుంచి యప్పాయప్పాజి యనునామంబుల గౌరవించి
యయ్యమాత్యపుంగవుని యుపదేశంబె యాదేశంబుగాఁ
గొని సమస్తరాజ్యకార్యంబుల నప్రమత్తుండై నిర్వర్తిం
చుచుఁ దా వైష్ణవుండయ్యును బక్షపాతంబు సేయక సకల
మతమతాంతరంబుల సత్యాసత్యంబుల విమర్శించుచు వారి
వారి తారతమ్యానుసారంబుగ నుచితగౌరవం బొసంగుచు
న్యాయైకదృష్టి నందఱికి నొక్కఁడై హర్షోత్కర్షంబునం బ్ర
జారంజకంబుగ ధరణిం బాలించుచుండె. 88

మాలినీవృత్తము.

బుధజనపరిపాలా ♦ బుచ్చమాంబానుకూలా
మధురవచనలోలా ♦ మాన్యసంభావ్యశీలా
విధునిభముఖలీలా ♦ వీతదుర్వైరిమూలా
యధికసుకృతజాలా ♦ వ్యాప్తతేజోవిశాలా. 89

ఇది శ్రీ బుచ్చివేంకయామాత్యతనయ సకల
సజ్జనవిధేయ ఆదిపూడి సోమనాథ నామ
ధేయ ప్రణీతంబయిన శ్రీకృష్ణదే
వరాయ చరిత్రంబు నందుఁ
ప్రథమాశ్వాసము
సంపూర్ణము.

---

శ్రీ

# కృష్ణదేవరాయ చరిత్రము.

## ద్వితీయాశ్వాసము.



నాయనికులకలశాం
భోనిధిరజనీకళత్ర ♦ బుధవనచైత్రా
దీనావనచరిత్రా
దానగుణస్తోత్రపాత్ర ♦ ధార్మికమిత్రా. 1

వ: అవధరింపుము. అట్లు కృష్ణదేవరాయ దేవేంద్రుండు పూజ్య
విజయనగరరాజ్య సింహాసనంబధిరోహించి మిక్కిలి మక్కువ
తోఁ బ్రజలఁ బాలించుచుండి. 2

చ. అతఁడొకనాఁడుచారుతర ♦ హర్మ్యతలాంతర చంద్రకాంతక
ల్పితసుఖధామమందహిత ♦ వైరవిభేదన దత్తచిత్తుఁడై
యతులకృతజ్ఞుఁడిమ్మరసు ♦ నాప్తునమాత్యునితో విచారమం
చితగతిఁ జేయుచోసచివ ♦ శేఖరుఁడల్లనఁ బల్కెనమ్రుఁడై. 3

ఉ. దేవభవద్విరోధులకుఁ ♦ దీవ్రదవానలమై చెలంగుఁగా
త్రావక బాహువిక్రమము ♦ దానిరుచింగనఁగోరిగంగరా
జో వసుధేంద్ర దెల్పెదన ♦ యూహనుబట్టమహోత్సవంబునన్
దేవరఁగొల్వరాకభవ ♦ దీయకటాక్షముధిక్కరించుటన్. 4

వ. వెండియు మనకు నరివెట్టుచు మైత్రినెఱపుచు నొక్క యుమ్మ
త్తూరుమాత్రంబె పాలించుచుండిన దేవరాజొడెయల సన్మా
ర్గంబు నతిక్రమించి యతనిపుత్రుండగు ని ద్దురాత్ముండు శివ
సముద్రంబు నాక్రమించి శ్రీరంగపట్టణంబు కైవసంబుసేసి
కొని దేవర నించుకయు సరకుసేయక మదోన్మత్తుండై వర్తిం
చుచున్నవాఁడు. 5

శా. ఆగర్వాంధునిక్రొవ్వణంచినఁగదా ♦ యన్యుల్గలోద్రేకపు
న్నాగంబుల్వలెనీకులోఁబడిమహా ♦ నందంబుసంధిల్లఁగా
భోగత్యాగపరాయణుండవగునీ ♦ పూన్కిన్ వెసన్ దీర్చును
ద్యోగంబెప్పుడుఁ జేయఁగల్గుదురుభృ ♦ త్యోహాసంవీప్తులై. 6

మ. అనిన్ భూపతిచిన్నినవ్వొలయనో ♦ యప్పాజితోల్దొల్తనా
తనికిన్ మేల్గలుపంగ నేర్పుగలదూ ♦ తంబంపనౌదానిమీ
తినినా హేతినిశాతధారపటిమో ♦ ద్రేకంబునందిద్దనౌ
ననిసామంబును శౌర్యమున్నెఱపుకా ♦ ర్యంబేర్పడందెల్పినన్. 7

గీ. సచివుఁడెద మెచ్చినృపవర్యు ♦ చతురమతికి
మంత్రిదాఁగ్రాన దానిలో ♦ మంత్రమెల్లఁ
దెలిసినకొలంది రాజన్యు ♦ తెలివితేట
లకును మదిఁబొంగి కార్యమ్ము ♦ లకుఁదొడంగి. 8

క. ధైర్యముసంభాషణచా
తుర్యముగాంభీర్యమొప్పు ♦ దూతనుగార్యా
కార్యవివేచనుబనిచెను
స్థైర్యోపాయములరిపుని ♦ తంత్రముగనిరా 9





ఉ. పంపినదూత చేరిరిపు ♦ పట్టణమున్విజ...
న్నం పెనటంచుఁ దెల్పితన ♦ కమ్మను జేతునికొల్వు వేడినన్
దెంపునన వ్విభుండుసభ ♦ దీర్చి వెనన్ దనుబిల్వనంపఁగాఁ
బెంపుదలిర్పనోలగముఁ ♦ బ్రీతినిజొచ్చివినమ్రుఁడై యనన్. 10

క. దేవరయెఱుఁగుదురుగదా
కేవలశౌర్యావతారుఁ ♦ గృష్ణనుదారున్
బావనధర్మవిహారున్
దేవేంద్రగురూపమాన ♦ దివ్యవిచారున్ 11

వ. కావున. 12

ఉ. మానృపసింహునిన్ గొలువ ♦ నూనుట శ్రేయము కాదుమీ
[కునా
మానవనాథునిజ్ఞనకి ♦ మానము ప్రాణముగాచికొంట తీ
ర్థానముగాఁగ మంటఁబడి ♦ మాడక యుండుటగానమీకు స
మ్మానముమానరోత్తముని ♦ మాటుననుంటసుమీ మహీధవా.

గీ. అనిన వెడ వెడనవ్వుచు ♦ నవనివిభుఁడు
వీరశ్రీకృష్ణరాయకం ♦ ఠీరవేంద్రు
డెఱపొకించుకమదిలేని ♦ విధముదోఁప
దూతఁజూచుచునిట్లనెన్ ♦ ధూర్తమతిని. 14

ఉ. వింటిమిమీప్రతాపములు ♦ వెఱ్ఱిగ వాగకుఁడాలుఁజాలుమా
తొంటివితంబుగాదుమముఁ ♦ దోఁచినయట్టులు ప్రేలుచుం
[డనూఁ
కొంటకుమీ బిభీషికల ♦ కున్వెఱపంది దువాఁగామమీ

బంటుతనంబు సాగదిఁక ♦ వచ్చినదారిని బొమ్ము చెచ్చెరన్ 15

క. అనిగంగవిభుఁడు వల్కినఁ
గనుదమ్ములయెఱుపునొఱవు ♦ గడలకుఁ బ్రాకన్
గనుఁగొని దూత యథోచిత
వినయము రౌద్రమ్ము దోఁచు ♦ విధమునఁ బలికెన్. 16

ఉ. దేవర రోటిలోఁ దలను ♦ దెంపునఁ బెట్టితి రేమి చేయనౌ
నే విధిఁ బోటు దప్పదిఁక ♦ హెచ్చుటయంతయుఁ దగ్గఁగాఁగ దా
కేవలుఁడే ప్రతాపనిధి ♦ కృష్ణమహీంద్రుఁడు మేరదప్పినన్
దావకృశానుఁడై యడరి ♦ దాయలభస్మము సేయఁ జూడుఁడీ.

గీ. అనిన నామాటలను విని ♦ వినని యట్లు
కలయఁ గనుఁగొని దూతకు ♦ సెలవొసంగి
కొలువుఁ జాలించి సేనానిఁ ♦ గలసి విభుఁడు
చనిన నతఁ డంత నచ్చోటి ♦ చందమరసి. 18

గీ. దొరలయన్యోన్య మొకయింత ♦ తొలఁగఁ జేసి
తరలి నిజపురమును జేరి ♦ ధరణినాథు
నోలగంబున దర్శించి ♦ యుచితరీతి
సభ్యులందఱు వినఁ బల్కెఁ ♦ జదురు మెఱయ. 19

శా. దేవా గంగఁడు మీఁదెఱుంగక కడున్ ♦ ధిక్కారముం జేసి తా
నావంతేని యభీతి లేక పటుగ ♦ ర్వాంధుండు నా మ్రోల దు
ర్భావం బేర్పడఁ బల్కెఁ జుల్కనగదు ♦ ర్భాషల్ మహాహంకృతిన్
గావా మాటలు సెప్ప నర్హములు మీ ♦ కర్ణాంకుశ శూలముల్.

మ. అనినన్ గోపవిఘూర్ణమానపటుహా ♦ ర్యక్షాతిరేకంబునన్



దనచూడ్కుల్ నిగుడించి ద్దెసలకున్ ♦ గర్జాసముజ్జృంభణో
క్తిని బ్రోత్సాహము వీరజాతమునకున్ ♦ గీల్గొల్ప నేర్పొప్పన
జ్జననాథాగ్రణి పల్కెఁ బల్కెనకురో ♦ షంబొల్కఁగా నిట్లనన్.

ఉ. చెండెద మండలాగ్రమునఁ ♦ జెండెగఁ జిమ్మెదు మాడ్కి వాని దో
రుండము భండనమ్మునవి ♦ రోధులతండపు గండడంగ దో
ర్దండపరాక్రమంబునకు ♦ దండిగఁ బండుగ చిక్కెఁ బొండు మీ
దండులఁ గూడి రండు రిపు ♦ దండనధర్మము నుండు ధాత్రిలోన్.

వ. అని యరిదర్పదళనంబునకై తమతమ దళంబులఁ గూర్చి
కొని కట్టాయితంబై శీఘ్రంబుగఁ బొడసూప సేనానాయ
కులకు నాజ్ఞయొసంగి కొలువు చాలించి యంతఃపురంబున నేకాం
తంబుగ మంత్రితో ననేక రాజ్యకార్యంబుల నాలోచించు
చుండి దూతం బిలిపించి యాశివసముద్రంపు దొరయగు గంగ
రాజొడెయల సన్నాహ సంరంభంబులఁ గూర్చి ప్రస్తావించిన
నద్దూతయు రాజేంద్రు నవలోకించి పరమగౌరవంబున. 23

ఉ. కొండఱుపాళెగాండ్రు దనుఁ ♦ గొల్వఁగఁ బొంగి శివంసముద్రమే
చందమునందు నైరులకు ♦ సాధ్యము కాదను ధైర్యమొంది మి
న్నందినవాఁడు గంగవిభుఁ ♦ డద్భుతమైన భవత్ప్రతాపమా
ధ్యందినసూర్యతాపమును ♦ దాఁ జవిచూడనివాఁడు గావునన్.

వ. మఱియును. 25

క. పరిసరగిరిగహనంబులఁ
బరిరక్షితమనులవారి ♦ పరిపూరితమా
వరకావేరీ వేష్టిత

మరయంగ నాదుర్గమరుల ♦ కరిదుర్గమహా. 26

క. కావుననే గంగఁడుకడు
కావరమున మిన్నుమన్ను ♦ గానఁడు దేవా
చేవరకాతని తంత్రము
వేవురుఁ దెలుపువాని ♦ విని చెదవినవే. 27

గీ. చిక్కరాజనంగఁ జెలిమికిఁ బాత్రుండు
గలఁడు గంగవిభుని ♦ గలఁచు వైరి
యతని మైత్రిమనకు ♦ నన్నివిధంబుల
వలయునతఁడు నిదియె ♦ నలచుచుండు. 28

క. అనిహితమును సూచించిన
మనుజేంద్రుండతని బుగుల ♦ మన్నించి వెసన్
బనిచెను జిక్కనృపాలుం
గనితనకుం దోడుసూపు ♦ కార్యము నెఱపన్. 29

గీ. పంపిదండయాత్ర ♦ పట్టణంబునఁ జాటఁ
బంచిసమరమునకు ♦ వలయునట్టి
సకలమైనవస్తు ♦ చయముసమృద్ధిగాఁ
గూర్చియంతఁ గొలువు ♦ కూటమందు. 30

శా. వీరాగ్రేసరులెల్లఁ దన్గొలువన ♦ విశ్వంభరాధూర్వహుం
డారూఢుండయి రత్నపీఠమునన ♦ వ్యాంశుచ్ఛటోపేతస
త్తారాలంకృతరత్నహారతతిచే ♦ తన్వారికంఠంబులన్
శ్రీరంజిల్లఁగఁ జేసి సంగరజయ ♦ శ్రీరక్తినూఁకల్పినన్. 31

ఉ. అందఱునైకకంఠ్యముగ ♦ నయ్యవనీశునిగూర్చి రాజసం



క్రందనమీహితార్థమున ♦ బ్రాణములమానమునుంచినారమే
నందియుమిందు లేదనుచు ♦ స్థైర్యము మీఱఁగ బాసఁ జేసియా
నందముతోడఁ బల్కినఘు ♦ నంబుగ మెచ్చి విభుండు వారికిన్. 32

వ. ఆదరపురస్సరంబుగఁ గప్పురంపువిడియంబొసంగి యెల్లి రేప కడ దండయాత్ర యని నిర్దేశించి పలికి యందఱికి సెలవొసంగి యంతఃపురంబుఁ జేరి యంతఃకరణపూర్వకంబుగఁ గృపారససాగరుండగు పరమేశ్వరు నుపాసించి యారాత్రిసుఖంబుగ నిదురించి యుషఃకాలంబున లేచి కాల్యకృత్యంబుల నిర్వర్తించుచుండు సమయంబున. 33

సీ. నీప్రతాపస్ఫూర్తి ♦ నిఖిలలోకములందు
నిండి వైరులనెల్లఁ ♦ జెండుఁగాత
నీసహాయంబుచే ♦ నేర్చి శాస్త్రమ్ములు
విద్వన్మహోతతి ♦ వెలయుఁగాత
నిన్వాడనాడక ♦ నీబంధుబలగంబు
నినుఁ జుట్టి గొల్చుచు ♦ నెగడుఁగాత
నీతేజమును బొంది ♦ నెఱి రాజమండలి
ప్రజలకానందమై ♦ ప్రబలుఁగాత
మంచు శ్రీకృష్ణరాయు ♦ దీవించ నెంచి
వచ్చెనో యనఁ దోఁచెఁ బూర్వమున నినుఁడు
మాపి చీఁకటిజగములఁ ♦ జూపువాఁడు
గ్రహములకు ఱేఁడు చంద్రుని ♦ కళకుఁ దోఁడు 34

ఉ. అప్పుడు దండనాథులు మ ♦ హాహవకేళివిలాసమూర్తులై
యొప్పఁచు వారివారిదళ ♦ మొప్పఁగఁ బజ్జలుదీర్చి మోసలన్
దప్పక రాజునాజ్ఞఁ దలఁ ♦ దాల్చ నిరీక్షణ సేయుచుండఁగా
నప్పృథివీశచంద్రుఁడు స ♦ మంచితభూషణభూషితాంగుఁడై.

గీ. అందఱిని సోచ్చరింపఁగ ♦ నాజ్ఞ యొసఁగి
యాత్మఁ బరమాత్మఁ దలపోసి ♦ యాప్తగణము
గూడి నడువంగ నప్పాజి ♦ తోడ వెడలి
యంతిపురపు మహాద్వార ♦ మందు నిలిచి. 36

సీ. ఐరావతము వ్రాలె ♦ నత్యున్నతంబయి
మదము చేనుట్టాడు ♦ మదవళంబు
పయిరత్నఖచితమా ♦ బంగారుచౌడోలు
నందధిరోహించి ♦ వందిగణము
పొగడంగ విబుధులు ♦ పొరిఁబొరి యాశీర్వ
దింప భేరీనాద ♦ మింపు నింప
మేడలపై నుండి ♦ మించువాల్గంటులు
గూర్మిఁ బువ్వులవాన ♦ గురియుచుండ
ముందు వెనుకను సేనలు ♦ మూఁగిమూఁగి
వచ్చుచుండఁగఁ గదలె వి ♦ వ్వచ్చుతండ్రి
వైభవంబున శ్రీకృష్ణ ♦ పార్థివుండు
ప్రథనజయలక్ష్మిపై నాస ♦ పరిఢవిల్ల. 37

వ. ఇవ్విధంబున.

సీ. రణభూరినిస్సాణ ♦ ధణధణధ్వనితోడ



వారణఘంటార ♦ వంబుతోడఁ
జటులఘోటకఖుర ♦ పుటనిస్వనముతోడ
రథనేమిపటుపటా ♦ ర్భటులతోడ
వీరాతివీరహుం ♦ కారనాదముతోడ
వందిమాగధజయ ♦ స్వనముతోడ
వేడ్కమైభృత్యులు ♦ వేయు కేకలతోడఁ
బ్రజలరాపిడిగిజే ♦ గిజేలతోడ
శబ్దమేరూపుగైకొన్న ♦ సరణిదోఁప
నెలమితమతమలోఁ బొంగి ♦ యేపుసూప
రిపులసన్నాహసంరంభ ♦ రీతిమాప
వెడలె శ్రీకృష్ణరాయని ♦ విజయధాటి. 39

వ. ఇట్లు విజృంభించి సకల సంభారసంపూరిత చతురంగసేనాపరివృతుండై యమ్మహామహీంద్రుండు విజయనగరంబు వెలువడి కతిపయప్రయాణంబుల శివసముద్రప్రాంతంబగు గౌరీపర్వతంబు సమీపించునంత, నంతకమున్న యద్ధరావల్లభుం డనిచిన దూతయొక్క చాతుర్యప్రభావంబున. 40

మ. వినయంబొప్పఁగఁ జిక్కరాజొడెయఁడ ♦ ప్పీవరాగ్రణిం జేరిస
ద్ఘనభూషాంబరరాజిఁ గాన్కనిడి య ♦ ద్ధాత్రీంద్రుకారుణ్యసూ
చనవీక్షామృతవర్ష ధారల నిజ ♦ స్వాంతంబు వెల్లుబ్బఁగా
ననిలోఁ దోడ్పడఁ బల్కి తోడనడిచెన్ ♦ హస్త్యాదిసైన్యంబు
[తోన్. 41

వ. అంత నచ్చట శివసముద్రపురవరాధీశ్వరుండు, శ్రీకృష్ణరాయ

మసీవల్లభుండు చిక్కరాజుఁగూడి యపారసైన్యంబుతోఁ
దనపై వచ్చుచున్నాఁడను వృత్తాంతంబుఁ జారులు విన్నవిం
చిన నాకర్ణించి. 42

సీ. బురుజులపై బాణ ♦ పుంజంబుఁ గూరిచి
యొడిసెలువ్వెడివారిఁ ♦ గడలనుంచి
వింటఁబోరెడువారి ♦ వెరవుమీఱఁగనుంచి
నీరగడ్తలలోన ♦ నింపియుంచి
యెల్ల యాహారముల్ ♦ గొల్లగాఁ గొనియుంచి
ఆలుబిడ్డలరక్ష ♦ కనువుపఱిచి
విపుల సైన్యంబుతో ♦ వెలుపలఁ దానిల్చి
మిత్రునుమ్మత్తూరి ♦ మేరనుంచి
రంగపురమున నొకనెయ్యు ♦ రక్షకునిచి
హెచ్చరికనుండ నందఱ ♦ నెచ్చరించి
వీరులకు ధర్మమార్గంపు ♦ విధివచించి
శత్రురాక నిరీక్షించి ♦ సంభ్రమించె. 43

వ. అంత. 44

గీ. చిక్కరాజుఁగూడి ♦ శ్రీకృష్ణవిభుఁడటుఁ
దరలిప్రేతగారి ♦ గిరుల దాఁటి
శివసముద్రపురపు ♦ చెంతఁగాననమందు
దండువిడిసె రిపుల ♦ గుండెలవిసె. 45

గీ. విడిసెనాటిరాత్రి ♦ వీరులసభఁగూర్చి
రిపునిదాఁకవలయు ♦ రీతిఁగూర్చి



చర్చసేయఁజిక్క ♦ జననాథుఁడిట్లనె
నందఱతని మెచ్చి ♦ యభినుతింప. 46

సీ. సమరలంపటుఁడగు ♦ సచివాగ్రగణ్యుండు
వడినుమ్మత్తూరిపై ♦ నడరవలయు
నరిభయంకరుఁడు మీ ♦ యనుజుండు శ్రీరంగ
పురము సాధింపంగఁ ♦ బోవవలయు
రాజశార్దూల మీ ♦ రక్షణంబున నేను
శివసముద్రాధిపుఁ ♦ జెక్కవలయు
నిట్టులు రిపులను ♦ మట్టాడి జయలక్ష్మిఁ
బ్రమదానమీరు చే ♦ పట్టవలయు
నెలమి కర్ణాటరాజ్యంబు ♦ నేలుఁజేఁడ
వినుము నా మతమిది విన్న ♦ వించినాఁడఁ
బ్రీతి మీకయి సర్వమ ♦ ర్పించినాఁడ
నెలవుపొసంగిన దానినేఁ ♦ జేయువాఁడ. 47

గీ. అనినఁజిక్కరాజుఁ ♦ గొనియాడె నప్పాజి
నెమ్మి నతనిమతము ♦ సమ్మతించి
యాదరించె మిగుల ♦ నవనీంద్రుఁడందఱి
హృదయపంకజంబు ♦ లెలమి నలరె 48

వ. అంత నమ్మనుజేంద్రుండు దనయనుంగు గమ్ముండగు శ్రీరంగ
దేవరాయలు శ్రీరంగపట్టణంబు ముట్టడింపను మంత్రిపుంగ
వుండగు తిమ్మరసుమ్మత్తూరు సాధింపను దమతమ దళంబుల
తో రేపకడఁ బయనంబై పోవ నాజ్ఞాపించి తక్కిన సైన్యంబం

తరుచు శివసముద్రంబు నాక్రమింపఁ బ్రతిక్షణంబు నిరీక్షిం చుచుండవలయునని హెచ్చరించి యందఱికి సెలవొసంగి సభవిసర్జించి యారాత్రి సుఖంబుగనిదురించె. నంతనుషః కాలంబగుడు నారాజశేఖరుండు వీణావేణునిస్వనంబుల మేల్కాంచి యీశ్వరు నుపాసించి సమరసన్నాహంబునకుఁ జొచ్చు నంత సూర్యోదయంబయ్యెనప్పుడు. 49

చ. కడఁకదలిర్పఁదిమ్మరసు ♦ గంధగజాశ్వపదాతిసేనతోఁ
గడువడినుమ్మత్తూరిపయిఁ ♦ గాలకృశానుకరాళమూర్తియై
వెడలెమహాట్టహాసమున ♦ వీరభటావళిగొల్వభాంకృతుల్
గడలకుఁగ్రమ్మవైరికుల ♦ కర్ణవిదారణదారుణంబులై. 50

వ. తదనంతరంబ. 51

క. శ్రీరంగపట్టణంబున
వైరులఁజెండాడుదీక్ష ♦ వహియించివెసన్
శ్రీరంగదేవరాయలు
ధారుణివడవడవడంకు ♦ ధాటిన్వెడలెన్. 52

క. అంతన్ధరణీకాంతుఁడు
వింతగసైన్యంబుదీర్చి ♦ విమలోత్సాహం
బెంతయుఁబురికొల్పఁగన
త్యంతమునెల్లెత్తిపల్కె ♦ నందఱువినఁగన్. 53

గీ. రాష్ట్రహితముకొఱకుఁ ♦ బ్రాణమర్పించిన
వీరవరునిహృదయ ♦ వీధులందు
దేశవాసులెల ♦ దేవునిగానెంతు



కలదెకీర్తికిని ♦ కంటెజగతి. 54

గీ. కానఁగర్ణాటరాష్ట్రంబు ♦ గాచుపొంటె
వీరులారగడంగుఁడీ ♦ విజయలక్ష్మి
కోరివరియించునెప్పుడు ♦ శూరవరుల
ధరణిఁబురుషార్థపరులన ♦ ధర్మచరుల. 55

చ. అని పురికొల్పనందఱు మ ♦ హాహవకేళికకళానురక్తులై
మనములనూరుబీరమును ♦ మాటికి నేత్రనవాంబుజంబులన్
ఘనతరవాగ్విహారములఁ ♦ గన్గొనఁజేసినఁ బొంగిభూవరుం
డనికిదళంబునూల్కొలిపె ♦ నాదట భేరిధణంధణార్భటిన్.

వ. అంత. 57

సీ. మించుకత్తులతోటి ♦ మేటికాల్బలములు
మీనజాతమురీతి ♦ మెఱయుచుండ
నదరిపారెడుమంచి ♦ బెదరుగుఱ్ఱపుదండు
లలలపఙ్క్తులఁబోలె ♦ నలరుచుండ
మదముతోనుట్టాడు ♦ మాతంగగమితిమిం
గిలపుగుంపులమాడ్కిఁ ♦ జెలఁగుచుండ
బహుళసంభారసం ♦ భరితమౌశకటముల్
సుడులకైవడిసొంపు ♦ వడయుచుండ
నబ్ధిఁబోలినసైన్యంబు ♦ లలరియుడరి
శివసముద్రము చెంతకుఁ ♦ జేరునంత
గంగవిభుసేనయొక్కటఁ ♦ గడఁగియార్చి
యొక్కపెట్టునవడిఁదాకె ♦ నుక్కుమెఱయ. 58

ఉ. తాఁకినఁదక్షిణంబతన ♦ దంతినిముందటఁబెట్టి సూటిగా
నీకడనాకడన్ బెనఁగ ♦ నీకయురంబులఁ గ్రుచ్చివైరులన్
వీఁకనడంచెఁగృష్ణపృథి ♦ వీపతి యాతనిసైనికోత్తముల్
తేఁకువమీఱఁబ్రోరిరిపు ♦ తేజముమాపిరి భీకరోద్ధతిన్ 59

గీ. ఇట్టులురువడించి ♦ యేత్తెఱ శ్రీకృష్ణ
సైన్యమెల్లకడలఁ ♦ జమురుచుండఁ
బ్రతిఘటించిరిపులు ♦ పట్టిపోరాడిరి
పోరుఘోరమయ్యెఁ ♦ బ్రొద్దుగ్రుంకె. 60

ఉ. అప్పుడుగంగఁడొక్కపరి ♦ యార్చిబలంబులఁగూర్చి పైఁబడన్
దెప్పరమైన తాఁకునకుఁ ♦ ద్రెల్లిరిమల్లిరి కృష్ణసైనికుల్
చప్పననెక్కి సైంధవము ♦ శాతకృపాణము దూసిశత్రులన్
గుప్పలుగుప్పలై పడఁగఁ ♦ గూల్పఁదొడంగెను గృష్ణుఁడుద్ధతిన్

వ. అయ్యవసరంబున. 62

ఉ. కీలికిగాలితోడ్పడిన ♦ క్రేవునఁగేలఁగరాళఖడ్గమున్
దాలిచిచిక్కరాజుకడు ♦ దారుణవృత్తినిశత్రుసేనలన్
జీలిచిచింపిచెక్కివడిఁ ♦ జిమ్మిశవమ్ములనెత్తురేరులన్
దేలఁగఁజేసియార్చెదన ♦ తేజముగృష్ణవిభుండుమెచ్చఁగన్

వ. ఇట్లు సమరసమవర్తులై విజృంభించి యావీరసింహులు పరబలంబులఁజించి చెండాడుచుండు సమయంబున. 64

గీ. పొంగిపొరలివచ్చు ♦ పూర్ణప్రవాహంబుఁ
బోలెఁగృష్ణనృపతి ♦ భూరిబలము
శత్రుసేనపైకి ♦ జయ్యనఁబఱతెంచి



యేపుఁజూపిరూపు ♦ మాపెనంత. 65

గీ. ఇప్పగిదిఁదనబలమెల్ల ♦ నొప్పదోఁచఁగ
గంగవిభుఁడాత్మలోఁగడుఁ ♦ గలఁగితొలఁగి
యొక్కపరుగునఁబరువెత్తి ♦ యూరుసేరి
కోటవాకిళ్లుమూయించి ♦ కొంతతేఱె. 66

గీ. అంతగగనవేది ♦ నలరారికరములు
చాచిసౌమ్యమూని ♦ సాధువృత్తి
శాంతిపాఠమొసఁగె ♦ సజ్జనావళికెల్ల
సితకరుండులోక ♦ హితకరుండు. 67

గీ. కృష్ణరాజునుసేనలఁ ♦ గృపదలిర్ప
నరసియారాత్రిగడపిపూ ♦ ర్వాద్రినినుఁడు
పొడువఘాజులఁబురికొల్పెఁ ♦ బురముమీఁద
నడరనప్పుడువారలు ♦ కడురయమున. 68

గీ. పట్టణము ముట్టడింపఁగఁ ♦ బట్టుపట్టి
చుట్టుముట్టునువిడియఁగాఁ ♦ జొచ్చిరంత
రాళ్లుబాణంబులొక్కట ♦ ఝల్లుమనఁగఁ
గోటపైనుండిపరిపంథి ♦ గురిపియార్చె. 69

ఉ. ఆర్చినఘోరబాణతతి ♦ నవ్విజయేంద్రుఁడుకోటమీఁదికిన్
బేర్చినకిన్కఁదక్షిణము ♦ ఫెళ్ ఫెళఁగాల్పఁగవానిధాటికిన్
దీర్చినసేనత్రుళ్లుచెడి ♦ ద్రెళ్లినగంగఁడుదైన్యసైన్యమున్
గూర్చిచతుఃకవాటములఁ ♦ గోటనుగావఁగఁదెల్పియిట్లనెన్.

క. చావెచటనేని సత్యము

గావునఁదముఁబ్రోచునేతఁ ♦ గాఁచుటపొంకెర్
జీవమువిడచుట ధర్మము
కేవలరోగములనింట ♦ గిట్టుటకంకెర్. 71

వ. అని యిట్లు తనుదొరపురికొల్పిననవ్వైరి వీరవారంబు వీరా
వేశంబునఁ జత్తుముఁ జంపుదు మను తెంపుతోఁ గోటవాకిళులఁ
గాపాడుచుండ నిట శ్రీకృష్ణరాజబిడౌజునియకుయప్రోత్సా
హంబున నచ్చతురంగసైన్యంబు. 72

గీ. కందకమునకుఁ గాష్టేరి ♦ కాల్వనుండి
వచ్చుజలమాపియలుగులఁ ♦ బుచ్చినీరు
పూడిచియగడ్తదిబ్బలు ♦ పోసిపోసి
కోటమీఁదికిమార్గంబు ♦ కొనకుఁజేసి. 73

గీ. దానిమీఁదుగ గోటపై ♦ సేనకొంత
చేరినలుదెసలోనికి ♦ దారిసేయఁ
బోరుభరమయ్యెవీరికి ♦ వారికపుడు
కృష్ణసేనవిజృంభించి ♦ కెరలితఱిమి. 74

ఉ. బాఁతులఁగత్తులర్ వఱియు ♦ బల్లెములంగొని యెక్కపెట్టునర్
దాఁకినఁ జేతులాడకవి ♦ తాకునవారిపుసైన్యమంతటర్
వాకిళులట్టిటీసివడిఁ ♦ బారఁగఁబోయినఁ గృష్ణునాజ్ఞచే
నాకడదండువారడరి ♦ యార్చిపయింబడి చంపఁజొచ్చినర్. 75

క. ఆర్తులమాకరుణానిధి
మార్తుఱనకమమ్ముఁ బ్రీతి ♦ మన్నింపఁగదే
కీర్తింతుమునీకీర్తిని



వర్తింతుమునీదునాజ్ఞ ♦ వహియించితలర్. 76

వ. అని మొఱవెట్టు నాశత్రుసైన్యంపు దీనాలాపంబుల నాలించి
కరుణారసతరంగితాంతఃకరణుండై యకృష్ణరాయ మహీ
రమణుండు వారికి శరణంబొసంగి సమరంబుఁ జాలింప దళంబు
లకు నాజ్ఞయొసంగి యుచితసేనాపరివృతుండై గంగరాజోడె
యలఁజెఱఁబట్టి శివసముద్రంబు ప్రవేశించిన. 77

గీ. జడిసిగంగవిభుఁడు ♦ దడబడకావేరి
మడుగులోనఁదూఁకి ♦ మడసెనపుడు
తెలిసిదీనిఁగృష్ణ ♦ దేవమహీపతి
యతనిపుత్రునరసి ♦ యాదరించి. 78

గీ. దేవరాజుమాకుఁ ♦ దీరనిమిత్త్రమై
మెలఁగుచుండి సౌఖ్య ♦ జలధిఁదోఁగె
నంతెనీదుజనకుఁ ♦ డడరిమమ్మెదిరించి
యనికిఁదొడఁగె నేమి ♦ యనుభవించె. 79

గీ. కాన దేవరాజు ♦ కరణివర్తించినఁ
బ్రజకునీకు సుఖము ♦ ప్రబలుఁగాన
నెయ్యమంతకంత ♦ నెఱపుచుమాతోడ
శివసముద్రమందుఁ ♦ జెలఁగుమీవు. 80

వ. అని హితోపదేశంబుసేసి యప్పట్టణాధికారంబతనికిఁ బ్రసా
దించి యతండొనర్చిన యనేక సేవాసత్కారంబుల సంతు
ష్టుండై వైరితండంబులకు దండధరభీకరుండగు నకృష్ణసార్వ
భౌముండు భండనోద్దండ దండనాథమండితంబగు చం

చమూనికర సమేతుండై వెడలి ఘుమ్మత్తూరుఁ జేరంబోవునంత
నంతకమున్న వైరిం దెగటార్చి యప్పురంబు సాధించియుండు
టం జేసి వీరాగ్రగణ్యుండగు సత్తినురసామాత్యుండు. 81

ఉ. మంగళవాద్యముల్ సెలఁగ ♦ నూనవనాథు మహేంద్రవైభవుం
దుంగపరాక్రమున్ ముదము ♦ తోడ నెదుర్కొని శత్రుఁ నోర్చుటల్
బొంగుచుఁ దెల్పఁ గృష్ణనృప ♦ పుంగవుఁ డాతని మెచ్చి యప్పురం
బం గుదలిర్పఁ జిక్కవిభు ♦ హస్తగతం బొనరించె మక్కువన్. 82

గీ. ఇట్లు మిత్రుని మన్నించి ♦ యెలమి నించి
సకలసేనావృతుండయి ♦ సంభ్రమించి
రయము మీఱఁగ వెడలి శ్రీ ♦ రంగపురము
సేరి లోఁ గని పైరిని ♦ జెండఁ గోరి. 83

ఉ. తమ్ముఁడు దోడుసూపఁగడు ♦ దారుణవృత్తి నినొక్క పెట్టునన్
ముమ్మరమైన వేగమున ♦ మూఁగి మగంటిమిఁ జూపి వప్రపుం
గొమ్మ యగల్చి లోపలికి ♦ గొబ్బున వేలకొలంది సేనతోఁ
గ్రమ్మి రిపున్ వధించి కొనె ♦ రంగపురంబుఁ గరంబు నెమ్మితోన్. 84

వ. తదనంతరంబు 85

ఉ. అప్పురినుండి మన్నెదొర ♦ లచ్చటివారలు దుష్టమార్గమం
దెప్పుడుఁ బోకయుండఁగడు ♦ హెచ్చరికన్ గనిపెట్టియుండు నే
ర్పొప్పెడు నొక్క నాయకుని ♦ యోగ్యుని నచ్చట నుంచి ఠీవిమై
నప్పృథివీశమౌళి చనె ♦ నాత్మపురంబునకుం బ్రియంబునన్. 86

సీ. తవిలి యివ్విధమున ♦ దర్పంబు దీపింప
సంగరంబున రిపు♦సమితి నోర్చి



విజయంబు చేమించి ♦ వేడ్కమై నరు డెంచి
పౌరుల నానంద ♦ వార్ధిఁ దేల్చి
దండనాథుల మెచ్చి ♦ తగుసత్కృతు లొనర్చి
దీనుల దండిగఁ ♦ దృప్తిపఱిచి
బుధజనంబుల నెల్ల ♦ భూరిదానమ్ముల
మన్నించి పరమేశు ♦ సన్నుతించి
జయమహోత్సవ మొనరించి ♦ సంతసించి
పూజ్యకర్ణాటలక్ష్మికిఁ ♦ బొలుపు నించి
ప్రాణసమముగఁ బ్రజలఁగా ♦ పాడఁ దొడఁగెఁ
గృష్ణదేవమహారాయ ♦ జిష్ణుఁ డధిప. 87

మాలినీవృత్తము.

హితజన సురభూజా ♦ ఈడితాత్యంత తేజా
సతతసుకవిభోజా ♦ చారుసంపద్బిడౌజా
వితరణశిబిరాజా ♦ వీతగర్వాహితౌజా
ధృతియుతహరిపూజా ♦ దీనచేతస్సరోజా.

ఇది శ్రీ బుచ్చి వేంకయామాత్యతనయ సకల
సజ్జన విధేయ ఆదిపూడి సోమనాథ నామ
ధేయ ప్రణీతంబైన శ్రీ కృష్ణదే
వరాయ చారిత్రంబునందుఁ
ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.

---

శ్రీ

# కృష్ణదేవరాయ చరిత్రము.

## తృతీయాశ్వాసము.



విద్యాప్రియహృదయా
కోవిద జనకృష్ణరాయ ♦ గుణకమనీయా
కేవల దేశవిధేయా
శ్రీవేంకటరంగరాయ ♦ శ్రితగాంగేయా 1

వ. ఆకర్ణింపుము, అట్లు కృష్ణరాజ బిడౌజుండు విజయలక్ష్మీవిలాస భూసురంబుగ రాజ్యంబు సేయుచు సంపూర్ణ యౌవనావిర్భూత ముఖవికాసంబుచే సకలకలాపరిపూర్ణుండగు శరత్పూర్ణిమాచంద్రుని ప్రహసించుచుండె. 2

సీ. కమనీయలావణ్య ♦ కలశార్ణవంబున
లలిఁబుట్టి మెఱసెడు ♦ లక్ష్మియనఁగ
రాజశేఖరునికై ♦ రాజవంశమ్మునఁ
గలిగినసర్వమం ♦ గళయనంగ
సౌందర్యమూర్తియై ♦ సద్గుణవర్తియై
మెలఁగెడునన్నుల ♦ మిన్నయనఁగ
దీపించుతిరుమలా ♦ దేవినిఁబెండ్లాడి
దివ్యసుఖమ్ములఁ ♦ దేజరిల్లె



సుగుణమణిభూషణమ్ముల ♦ సొంపుగన్న
రుక్మిణీదేవిఁగృష్ణుఁడు ♦ రూఢిమెఱయఁ
బరిణయంబయి యానంద ♦ వార్ధిలోనఁ
దోఁగివర్ధిల్లినవిధంబు ♦ దోఁపనధిప. 3

క. వైవాహికవిధిఁదిరుమల
దేవిందగనిట్లుకృష్ణ ♦ దేవవిభుఁడుదా
దేవిఁగఁగైకొని సుజనుల
దీవెనలంబడసి కొన్ని ♦ దినములపిఁదర్ 4

సీ. గనినుద్భవించిన ♦ ఘనహీరమణిరీతి
నడవిగల్గినమంచి ♦ యగరుతీరు
మృగములోనొదవిన ♦ మృగమదమ్ము విధమ్ముఁ
గంధిఁబుట్టినమౌక్తి ♦ కంబుకరణి
వెలయాంధ్రులోఁబుట్టి ♦ విమలగుణాళిచే
నొప్పియెప్పుడుఁదన ♦ మెప్పువడయఁ
గోరుచిన్నాదేవిఁ ♦ గూరిమిఁబెండ్లాడె
నవనిలోనందఱు ♦ నెన్ననంగ
మణులఁగొనురాజసద్గుణ ♦ మణినిగొనఁడె
కొనకయుడిగినదుష్కీర్తి ♦ కొనకుఁగనఁడె
కాననౌదార్యమునుజవి ♦ గాంచినట్టి
విబుధుఁడైవాఁడుశ్రీకృష్ణ ♦ విభునిఁదెగడు. 5

క. ఇక్కరణిఁజిన్నమాంబన్
మక్కువతోఁబెండ్లియాడి ♦ మనుజేంద్రుఁడుదా

నక్కమలాత్మునిపోలికఁ
జక్కఁగనలరారుచుండి ♦ సంతోషమునన్. 6

ఉ. వాడలుమేడలున్నతియు ♦ బాటలుపేటలు రచ్చకూటముల్
వేడుకతోటలుంగలుగ ♦ వింతగఁగట్టెను నాగలాపురిన్
గీడుమదిందలంచకను ♦ కీర్తిఁజెలంగినతల్లి పేరటన్
బాడియకాదెపుత్రులకు ♦ మాతలసద్విధి గౌరవించుటల్. 7

క. ఆనాగలాపురంబున
నానావిధరుచిరశిల్ప ♦ నైపుణ్యములన్
మానితమగుసౌధమ్మున
మానవతీమణిని జిన్న ♦ మాదేవినిడెన్. 8

గీ. విజయలక్ష్మీవిలాసమై ♦ వెలయునట్టి
విజయనగరంబులోపల ♦ వివిధవిభవ
మందిరంబగు సుందర ♦ మందిరమునఁ
దిరుమలాదేవి గుణశచీ♦దేవినునిచె. 9

క. సుమశరసుందరుఁడగునా
కమనీయతముఁడు తనము♦కాంతామణులన్
సమభావముతో నివ్విధి
సమలసుఖాంభోధిఁ దేల్చె ♦ ననవరతంబున్ 10

గీ. ఇట్టులిరువురతోఁగూడి ♦ యిష్టసుఖము
లనుభవించుచునుండియు ♦ నందుఁజిక్కు
వడకవర్తించి సముచిత♦వర్తనమునఁ
జాలమెలకువతో రాజ్య♦మేలుచుండి. 11



మ. ఒకనాడంతిపురంబులో సకలగ్రంథోపేతసౌధంబులో
నకలంకోజ్జ్వలపూర్వభూపతిలకా♦ఖ్యాతంబులంజూచుచో
నొకచో సాళ్వనృసింహభూధవునిభ♦వ్యక్తిప్రభాపూతమౌ
నొకలేఖంగనియందుగాంచెనృపుఁడి♦ట్లొప్పారువాక్యంబులన్.

ఉ. సాళ్వపరాక్రమంబెసఁగ ♦ శత్రులనోర్చియుమూడుకోటలన్
గెల్వగలేకపోయితిని ♦ కేవలమీమృతికారణంబుగాన్
దెల్వియుఁదేటయున్నతియుఁ♦దేజముమీఱఁగమత్కులంబునన్
జెల్వుగఁబుట్టివప్రములఁ♦జేకొనుధన్యుఁడెమాన్యుఁడెంతయున్.

క. అనియున్నదానిఁగనుగొని
జనితోత్సుకవృత్తిఁజదివి ♦ సచివోత్తమునిన్
మనుజేంద్రుఁడపుడెపిలువం
బనిచివడిన్ లేఖఁజూపి ♦ ప్రశ్నించెవేడ్కన్. 14

ఉ. సంగరరంగనిర్దళిత ♦ శత్రుతురంగమతంగజాదిసే
నాంగునిధర్మసంగునిశు♦భాంగుని శౌర్యసమార్జితాచ్ఛస
ప్తాంగునిపీతభంగునిఁబ్ర♦తాపపతంగునిధైర్యపుంగవున్
సింగనిదాతయైనసర ♦ సింగనిమాటికిమెచ్చుచిట్లనెన్. 15

ఉ. ఆనరసింహభూవిభుని ♦ యంతిమవాంఛితమిట్లుగాంచియున్
మానమెమద్భుజాగ్రరమ ♦ మాణమహోగ్రతరాసిదూసిసే
నానులతోడివైరిసర ♦ నాథులఁగూల్చితదీయవప్రముల్
మానితవైఖరింగొనక♦మానినమత్ప్రియమంత్రిపుంగవా. 16

గీ. కానదండయాత్ర ♦ కైనసన్నాహంబు
సేయువలయు రిపులఁ ♦ జెండవలయుఁ

గోటలెవియొ తెల్పు ♦ కూల్చెదఁ గాల్చెద
విజయలక్ష్మికొక్క ♦ విడిదిఁ గొనెద. 17

గీ. అనుడు నాప్తసచివుఁ ♦ డయ్యవనీశుని
యుద్యమంబు మెచ్చి ♦ యుచితరీతి
మానవేంద్రుమదిని ♦ మఱియు నుత్సాహంబుఁ
బెంపనెంచి పలికెఁ ♦ బ్రీతి నిట్లు. 18.

సీ. ఉత్కళభూపతి ♦ యున్మాదవృత్తిమై
యుదయగిరిం గొని ♦ యున్నవాఁడు
రాచూరు ముద్గల్లు ♦ నేచి బిజాపురి
యేదులఖాన్ సంగ్ర♦హించి నాఁడు
ఈమూఁడు దుర్గము♦ లెలమి నోర్చినఁ గాని
కర్ణాటలక్ష్మికిఁ ♦ గాపుగాదు
కాన మీరుదయాద్రిఁ ♦ గైకొని తదుపరి
యవనులఁ బెగట్పు ♦ నసుగవలయు
దేవరపితౄణమిప్పుడేఁ ♦ దీర్పవలయు
నరివనంబులకగ్నివై ♦ యడరవలయు
బుధుల దీనుల గావంగఁ ♦ బూనవలయు
శౌర్యకీర్తుల నీరీతిఁ ♦ జాటవలయు. 19

క. అని మంత్రివరుఁడు దెల్పిన
మనమున నరినోర్చు వేడ్క ♦ మల్లడిగొనఁగన్
మనుజేంద్రుఁడనికి వలపిన
మొన్నలన్ జతగూర్చు పనికి ♦ మునుకొని యంతన్. 20



సీ. తుండాగ్రమున మహో ♦ ద్దండంబుగొని వైరి
తండముల్ సెండు వే♦దండములను
దురమున మునుముందుఁ ♦ జొరఁబడి రౌతుల
నరులపై నూల్కొల్పు ♦ నశ్వములను
సమరాగ్రతలమున ♦ సముదగ్రమూర్తులై
శత్రులనూటాడు ♦ సైనికులను
పరిపరివిధములఁ ♦ బరికించి పరికించి
సేనలో సారంబుఁ ♦ జేరఁదీసి
దండధరభీకరోద్దండ ♦ దండనాథ
మండితముఁ జేసి సకలసా♦మగ్రిఁ గూర్చి
మంతనమ్మున మంత్రితో ♦ మనుజనాథ
మౌళి సజ్జనకంజాత ♦ హేళి పలికె. 21

క. అన్నివిధమ్ముల ననికిన్
సన్నద్ధంబై చెలంగ ♦ సైన్యంబెల్లన్
మిన్నక యరిపై నుఱుకన్
జన్నే కారణము లేక ♦ సచివోత్తంసా. 22

క. సామమునఁ గార్య మొదవిన
సేమంబగు నిరువురకును ♦ సిరి వర్ధిల్లున్
దామసపరులగు వైరుల
కామంబుదొలంగు ధర్మ♦కాంతయుఁ జెలఁగున్. 23

ఉ. కానఁ గళింగభూపతికిఁ ♦ గ్రక్కునఁ దెల్పుము మాకు మేర కృ
ష్ణానదిగా నయ్యుదయ ♦ శైలముతో నటు కొండవీడు స్వా

ధీనముచేసి పూర్వగతిఁ ♦ దీరని మైత్రి మెలంగుమంచుఁ దా
దీని కెదిర్చినన్ ఫలము ♦ తీక్ష్ణమటంచును దేటయౌనటుల్. 24

క. విభుఁడిట్లానతియొసఁగిన
శుభగుణసంపన్నుఁడొకని ♦ శూరును దారున్
రభసమునఁ బంచె నిభపతి
సభకున్ సచివుండు కార్య ♦ జాతము దీర్పన్. 25

క. దూతయు సత్వరమునఁ జని
ఖ్యాతుండగు నుత్కళేశు ♦ గర్వావేశున్
వీతభయుండయి కన్గొని
నీతివిచక్షణతఁ బల్కె ♦ నిండిన సభలోన్. 26

శా. దేవా మీరు ప్రతాపశీలురు మహా ♦ ధీరుండు శ్రీకృష్ణభూ
దేవేంద్రుండ సమాన శౌర్య కరుణా ♦ దీప్యత్ప్రభావుండు స
ద్భావోపేత యశస్కులై యుభయులు ♦ ద్యన్మైత్రి వర్తిల్లినన్
మీ వంకన్ దలయెత్తి చూడఁ గలరే ♦ మ్లేచ్ఛేశులెవ్వారలున్. 27

గీ. కృష్ణవిభుఁడు మీరుఁ ♦ గృష్ణార్జునులవలెఁ
గూర్మి పేర్మితోడఁ ♦ గూడియుండ
నన్ని సౌఖ్యములును ♦ హస్తగతంబగు
నచటనిచట ప్రజకు ♦ నందఱకును. 28

గీ. అనినఁ గొల్వులోని ♦ యార్యులందఱు నహా
యింత యొప్పఁ బల్కె ♦ నే యితండు
వినయభూషణుండు ♦ విమలవాక్చాతుర్య
వంతుఁడనుచుఁ బొగడి ♦ రంత నతఁడు. 29



క. అటుసరకుఁ గొనక వినయము
స్ఫుటముగ ముఖమందుఁ దోఁపఁ ♦ బూర్ణమృదూక్తిన్
బటుతర నిజపతిభక్తిన్
గటకేంద్రుని గూర్చి పల్కెఁ ♦ గార్యాసక్తిన్. 30

గీ. దేవ కృష్ణవేణి ♦ దేవరాడ్భూమికిఁ
బూర్వరీతి మేర ♦ పూర్తిగాఁగఁ
గొండవీడు పొడుపు ♦ కొండ శ్రీకృష్ణుని
వశము చేసి మైత్రి ♦ వడసి మనుఁడు. 31

మ. అనినన్ భూపతి కోపవేగమున హా ♦ హాసీచ మా ముందటన్
మనుజేంద్రుండని యొక్క నాయకుని ను ♦ న్మాదంబునన్ బాడ దే
తనయీ డెన్నక మమ్ముఁ గోటలడుగన్ ♦ దానిన్నుఁ బుత్తెంచె నే
నిను నా మూర్ఖునిఁ జక్కఁ జేసి విడుతున్ ♦ నేఁ డెల్లి ఘోరాజిలోన్

క. అనిదూతఁ జూచి పలికిన
వినయముతో నతఁడు మరల ♦ విభుని ముఖమునన్
దనదృష్టి నిలిపి యిట్లనె
విను వారల మనములెల్ల ♦ విహ్వాలమందన్. 33

ఉ. నాయకులైన నేమి వర ♦ నాయకులైనను నేమి న్యాయసం
ధాయకు లేధరిత్రి నివి ♦ ధాయకులై విలసిల్లు చంద్రుమా
నాయకుఁ డాజిమీఁదు వర ♦ నాయకులన్నఱు మాడఁ జూచి మా
నాయక నాయకామనుజ ♦ నాయకయందురుగాక పోయెదన్.

గీ. అనిన నాతనిఁ జూచుచు ♦ నట్టి చూచి
విభుఁడు సేనానితోఁ గొల్వు ♦ విరిసి చనియె

దూతయును మెల్ల మెల్లఁగ ♦ ద్వారలనెల్ల
మంతనమ్మునఁ గనుఁగొని ♦ మతముఁ దెలిసి. 35

క. అంతట సత్వరముగ భూ
కాంతుఁడు గను వేడ్క మదిని ♦ గడలుకొనంగా
నెంతయు వడినే తెంచెన్
స్వాంతము పెల్లుబ్బ విజయ♦నగరంబునకున్. 36

గీ. వచ్చి కొల్వు సొచ్చి ♦ వాసవప్రాభుఁడగు
విభునిఁ గాంచి హృదయ ♦ వీధి నలరి
యచటి చంద మెల్ల ♦ నచ్చొత్తినట్లుగాఁ
దేటపఱిచె నిట్లు ♦ తెల్లమీఱ. 37

ఉ. దేవ కడున్ మదించి భవ ♦ దీయహితార్థము ధిక్కరించి తా
దేవర నొక్క నాయకుని ♦ తీరున నెంచె నృపాధముండు దు
ర్భావవిభావరీవికృత♦భావుఁడు వాఁడు భవత్ప్రభావమున్
భావన సేయు నెట్లు తవ ♦ భాస్కర తేజము సూపకుండినన్. 38

చ. అనివచియింపఁగా వినియు ♦ దగ్రమహోగ్రహవిగ్రహోగ్రుఁడై
జనపతి నాల్గువంకలఁ బ్ర♦చండతరానల భీషణంబుగాఁ
గనుఁగొని పల్కె ఘోరలయ ♦ కాలఘనాఘనగర్జనోద్ధతిన్
దనువినువీరవారమరి ♦ దర్పమునార్పఁగడంగు నేర్పునన్. 39

ఉ. ద్రుంచెద వాని శీర్షము వి♦ధుంతుదహాసిమహాసిదూసి ఖం
డించెద వాని దండులవ ♦ డింగడికండలుగాఁగఁ బొంగి క్రీ
డించెద భండనస్థలిఁగ ♦ డిందిమగంటిమిఁ గ్రీడికై వడిన్
డించెదఁ గస్నడంబునకు♦ డీకొను మాస్తురఘాకనంతయున్. 40





చ. అనితనదండనాథులన ♦ హార్పతి తేజులస్వా...
గనుగొని వీరులార మన ♦ కన్నడభూమికి భూషణంబులై
మని యెదు మీకు నేఁడొదవె ♦ మాతృధరాతలరక్షణంబునం
దనుపమవిక్రమక్రమము ♦ నద్భుతరీతిని జూపు భాగ్యమున్. 41

గీ. కాన మొనలఁ గూడి ♦ కట్టాయితంబయి
రేపకడన తోడ్చుఁ ♦ జూపవలయు
నంచుఁ దెల్పి తార♦హారము లైడలంద
లంకరించి తమ్ము♦లమ్ము లొసఁగె. 42

క. అంతన్వారలు ధరణీ
కాంతున్ వీక్షించి నిటల ♦ ఘటితాంజలులై
స్వాంతము పెల్లుబ్బగని
శ్చింతయుఁ దమి మీఱఁ బల్కి ♦ రేర్పడు భక్తిన్. 43

ఉ. మానవనాథ కన్నడము♦ మాకు శరీరము నీవు ప్రాణమున్
గానఁ దదర్థ మర్పణము ♦ గాఁగ సమస్తము నుంచి నాము నీ
యానతిఁ దాల్చి యాదలమ ♦ హాహవకేళికళా ప్రగల్భముల్
మానితరీతిఁ జూపి జయ ♦ లక్ష్మిని గూర్చెద మింద్రవైభవా.

గీ. అనిన వారలఁ గరుణార ♦ సార్ద్రదృష్టిఁ
దనిపి సెలవిచ్చి పురిలోన ♦ దండయాత్ర
సాటఁగాఁ బంచి చాలించి ♦ సభ విభుండు
రయము మీఱ నంగనంతః♦పురంబుఁ జేరి. 45

క. ఏకాంతంబున దూతన్
భూకాంతుఁడు పిలువనంపి ♦ పొడమిన కోపితో

నాకరిపతివన్నాహా
నీకంబులఁగూర్చియుడుగ ♦ నెమ్మినతండున్. 46

గీ. కేలుదమ్మిమోడ్చి ♦ కృష్ణునిదలకించి
పరమభక్తితోడఁ ♦ బలికెనిట్లు
విన్నవింతు దేవ ♦ వినుముత్కలేశుని
నిర్ణయంబు లెల్ల ♦ నిండుమదిని. 47

సీ. ఆహవ దోహళుం ♦ డగుతిరుమలపాత్రు
నుదయాద్రిగావఁగా ♦ నుంచినాఁడు
విక్రమ సౌభద్రు ♦ వీరభద్రుంగొండ
వీడురక్షింపఁగాఁ ♦ బెట్టినాఁడు
రణకళాపారీణు ♦ రామచంద్రుంగొండ
పల్లికిఁ బ్రాపుగాఁ ♦ బంపినాఁడు
కరిఘటాటోపభీ ♦ కరసేనలంగూడి
స్వయముగామిముఁదాఁక ♦ వలచినాఁడు.
గొల్లగానెల్లసామగ్రి ♦ గూర్చినాఁడు
సమరసన్నాహమిట్టులు ♦ సలిపినాఁడు
మీదుశౌర్యాగ్ని వేండ్రమై ♦ మేరమీఱి
ముట్టినంగాని తెలియఁడు ♦ మూఢుఁడతఁడు. 48

క. ఎనిమిదేఁబదులకోతుల్
ఘనులగుపదివేలకొలఁది ♦ కాలరులుదయా
ద్రినిగాచుచున్నవారలు
వినయంబావంత లేని ♦ వీరులవార్యుల్ 49



గీ. వెన్నుఁజూపకయడరెడు ♦ వీరుకరణిఁ
జెన్నుమీఱెడునుదయాద్రి ♦ చిక్కనేని
దక్కఁగలకోటలన్నియు ♦ నొక్కటొకటి
రాలుముడి తెగిముత్తెముల్ ♦ రాలునట్లు. 50

క. అనివినిచినయద్దూతన్
ఘనముగమన్నించి పంచె ♦ నరపతిరవియున్
దనఖరకరములనలసిన
జనులకువిశ్రాంతియొసఁగఁ ♦ జయ్యనఁగ్రుంకెన్. 51

ఉ. అంతదినాంత కృత్యముల ♦ నంతనుదీర్చియథార్హభోజనం
బెంతయుఁ బ్రీతిమైసలిపి, ♦ యిష్టసుఖంబులఁ గొంతయుండిసు
స్వాంతలతాంతమున్ హరికు ♦ పాయనమిచ్చిప్రశాంతమూర్తి
[భూ
కాంతుఁడుపవ్వళించెసిత ♦ కంజముఁబోలినమేలిపాన్పుపైన్. 52

గీ. ఇట్లుపవ్వళించి ♦ యొలమితోనిద్రించి
గీతవాద్యములఁబ్ర ♦ భాతవేళ
మేలుకాంచి విష్ణు ♦ లీలలమదినెంచి
కాల్యకృత్యములకుఁ ♦ గడఁగునంత. 53

మ. ఉదయాద్రిన్వడిఁదోఁచివైరితిమిరౌ ♦ ఘోద్వృత్తిఁబోఁజిమ్మిభీ
ప్రదుఁడైదుష్టులకిష్టబంధుసుహృద ♦ బ్జంబుల్ప్రమోదిల్లనె
మ్మదివర్ధిల్లుమటంచుఁగృష్ణనృపతిన్ ♦ మన్నించిదీవింపనా
నుదయాద్రిందగఁదోచెభాస్కరుఁడుధీ ♦ రోదాత్తమూర్తిప్రభన్

ఉ. అప్పుడుసంభ్రమంబున ♦ నుహాహవదోహళులైననాయకుల్.

తెప్పరమైనసేనలను ♦ దీర్చియథావిధిదండయాత్రకై
యప్పనఁగోరిమోసలస ♦ మర్త్యతలంబులవేచియుండఁగా
నప్పృథివీశమౌళిమణి ♦ యంచితరీతినలంకృతాంగుఁడై. 55

క. దేవీరత్నములొసఁగెడు
దీవెనలంబడసిదేవ ♦ దేవునిమదిలో
భావించిసచివమణిసం
భావింపఁగనగరువెడలి ♦ ద్వారముచెంతన్. 56

సీ. సజ్జీకృతంబయి ♦ సకిలించినిలిచిన
శ్వేతసైంధవమును ♦ బ్రీతిఁదట్టి
చెంగునఁబై నెక్కి ♦ చేతవాగెధరించి
వీవనలిర్వురు ♦ వీచుచుండ
వెలిగొడుగునొకండు ♦ వేడ్కఁబట్టుచునుండ
భాంకృతుల్దెసలకుఁ ♦ బర్వుచుండ
జయజయధ్వానముల్ ♦ చదలుముట్టుచునుండఁ
గుసుమవర్షంబులు ♦ గురియుచుండ
దండనాథులు దమతమ ♦ దళముఁగూడి
నలుగెలంకులఁ దమిమీఱి ♦ నడుచుచుండ
వీరకంఠీరవుఁడుకృష్ణ ♦ విభుఁడువెడలె
నుదయగిరి చెంపగజపతి ♦ మదమడంప. 57

వ. ఇట్లువెడలి. 58

చ. చకచకలీను శస్త్రముల ♦ చండతరాంశులుసూర్యరశ్ములన్
బకభక నవ్వుచుండవర ♦ బాహ్లికసైంధవ పారసీకముల్



తకతకపారువేగమున ♦ ధాత్రివడంకుచు నుండవైరులన్
వికవిక సేయువేడ్కమది ♦ నిండహుటాహుటిఁ బోయిముం
[ద్రటన్.

చ. ఉదయగిరీంద్రముల్ సమద ♦ యోధసురక్షితవప్రచంద్రముల్
గదిసినరేంద్రచంద్రుఁడరి ♦ ఖండనపండితులైనవీరులన్
దుదిమొదలంటనాసుదృఢ ♦ దుర్గముఁదాఁకఁగనూలుకొల్పినన్
బెదరొకయింతలేకదరి ♦ బెట్టుగముట్టిరికొండచుట్టునన్. 60

వ. తత్సమయంబున. 61

ఉ. జారెడుకొండపైకడరి ♦ చయ్యనఁబ్రాకెడుకృష్ణసేనలన్
దారుణతప్తతైలముల ♦ ధారలబాణపరంపరాహతిన్
ఘోరశిలాప్రవర్షములఁ ♦ గుప్పలుగుప్పలుగాఁగఁగూల్చుచున్
జేరఁగనీకవెందిరుగఁ ♦ జేయుచునుండిరిశత్రులుద్ధతిన్. 62

ఉ. కృష్ణునిసేనలుందమన్న ♦ కేసరియాజ్ఞవహించియాదలన్
గృష్ణసమానశౌర్యమునఁ ♦ గిన్కమెయిన్ బైఁబైనఁద్రోచియ
త్యుష్ణరిపుప్రతాపమున ♦ కోర్వకత్రెళ్లియు మళ్లియంత్యకా
లోష్ణకరోగ్రతేజమున ♦ నొక్కటనూకుచునుండిరార్చుచున్

వ. ఇట్లయ్యజేయ పరాక్రమధురంధరుండగు నక్కృష్ణసార్వభౌ
ముండు గాలాంతకులనంబోలిన ముప్పదినాల్గువేల కాలరుల
తోడను నడయాడు పెనుగొండలోయనఁగనంబడి వైరితం
డంబుల గుండెలు వడంకంజేయునట్టి యష్టశతవేదండంబు
లతోడను శత్రుహృదయంబులు సుడివడునట్లు దమహేషా
రంబుల దిక్కులు పిక్కటిలంజేసి కదనంబునకుఁ గాలుద్రవు

నశ్వసహస్రంబులతోడను బదునెనిమిదిమాసంబు లొక్క-
మొగినహోరాత్రంబులు ముట్టడించియుఁ దద్దుర్గంబు మొక్క-
వోని వీరాగ్రేసరుంబోలె దుర్గమంబై పొల్చుచుండె. 64

క. ఎన్నియుపాయంబులనిటుఁ
బన్నినభేదించు తెఱఁగు ♦ పట్టకయున్నన్
గ్రన్ననఁగనుగొనెఁగృష్ణుం
డన్నగరాజంబు వెనుక ♦ నలరెడుత్రోవన్ 65

ఉ. ఒక్కనికంటెనెక్కుడవగ ♦ నొక్కటఁబోవఁగరానిదానిఁదాఁ
జక్కఁగవిస్తరించుగతి ♦ స్వాంతమునందలపోసివేలకుం
మిక్కిలియైనవారి నట ♦ నేర్పునఁబెట్టిసారంగముల్వడిన్
బెక్కులుగొట్టిమార్గమును ♦ బెల్లుగఁజేసెనువైరిబెగ్గిలన్. 66

గీ. ఇట్లుత్రోవసేసి ♦ యినుమడించినకోప
మడరఁగృష్ణచంద్రుఁ ♦ డార్చి పేర్చి
వీరతతికిఁజెవులు ♦ విందుగానిట్లనె
సింహగర్జనంపు ♦ చెలువుమెఱయ. 67

చ. మదరిపుమస్తకంబుపయి ♦ మత్పదపంకజ మూన్చిగానియీ
కదనతలంబు వీడనిది ♦ కల్లయొనర్పఁగ బ్రహ్మవచ్చినన్
తుదకుసురాసురుల్ గొలువఁ ♦ దోయజనేత్రుఁడుదానెవచ్చినన్
బెదరకనిల్చిపోరిమద ♦ భీష్మముపూర్తియొనర్చితీరెదన్ 68

చ. అనిన జయస్వనంబుచద ♦ లంటఁగనార్చిరి వీరవారముల్
ఘనతరభేరిభాంకృతులు ♦ గర్ణకఠోరముగాగమ్రోసెన
జ్జనపతి యాజ్ఞ చేసడరి ♦ సామజముల్ వడిఁదాఁకి ద్వారముల్



దునకలునేసె సైనికులు ♦ దూఁకిరినూకిరి పేర్చిలోనికిన్ 69

గీ. ఇట్టులురువడించి ♦ యేడ్తెఱఁబఱతెంచు
కృష్ణుసేనఁగాంచి ♦ కెరలితిరుమ
లేశ్వరుండుఫౌజు ♦ లెల్లనొక్కెడఁగూర్చి
తాఁకెదగరుకొండఁ ♦ దాఁకినట్లు. 70

ఉ. చండప్రచండులొండొరులు ♦ శౌర్యవిజృంభణవృత్తిఁబోరఁగా
భండనరీతిచూపఱకు ♦ భారతయుద్ధముజ్ఞప్తిదెచ్చెమా
ర్తాండుఁడునింగినిక్కిబలు ♦ దారుణకర్మముచూచిరోసెనా
నుండెనుబశ్చిమాద్రికడ ♦ నుజ్వలతన్ దగఁబాసియంతటన్. 71

ఉ. కృష్ణనృపాలచంద్రుఁడతి ♦ కృష్ణవరాశ్వమునెక్కిచేతిలో
జిష్ణునివజ్రముం దెగడు ♦ చిత్రమహోగ్రతరాసిఁబూనియా
యుష్ణకరాంశమురిబడసి ♦ యుర్వి మెలంగెడుకృష్ణవర్త్ముఁడో
కృష్ణుఁడనంగవచ్చెరణ ♦ కేళికివైరులగుండెజల్లనన్ 72

గీ. వచ్చియంతటదానయై ♦ వఱలుచుండి
శత్రుసైన్యంబుసరసరఁ ♦ జమరిచమరి
తిరుమలేశునిజెఱఁబట్టి ♦ దేవనిభుడు
కన్నడపువీరులందఱుఁ ♦ దన్నుఁబొగడ. 73

ఉ. పిమ్మటదుర్గమందు నొక ♦ వీరునిగాపుగఁబెట్టియందునం
దమ్మగుకృష్ణ విగ్రహము ♦ దాఁగొని బాసనుగావవైరిశి
క్షమ్మునఁ బెట్టుపొగనొక ♦ సారిపదమ్మునఁ దన్నిఠీవిమైఁ
గ్రమ్మఱరాజధానికిఁగ ♦ రమ్మురయమ్మునఁబోయికృష్ణుఁడున్ 74

సీ. చిత్రశిల్పములచేఁ ♦ జెల్వగుశ్రీకృష్ణ

నాలయంబొకవంక ♦ నలరఁగొలిపి
ఘనశిలాస్తంభముల్ ♦ గలిగిపొల్చుబజారు
రామమందిరము ♦ రంగఁగట్టి
రణమునఁబడ్డవా ♦ రలకుటుంబములకు
జీతబత్తెంబులఁ ♦ బ్రీతినొసఁగి
తగినసన్మానముల్ ♦ దండనాథులకిచ్చి
ప్రజలసంతోషంబుఁ ♦ బ్రబలఁజేసి
గజపతినిగన్న చోటెల్ల ♦ గర్వమడఁప
జాలుచతురంగసైన్యముల్ ♦ జతనపఱిచి
కొల్లగానెల్లసామగ్రి ♦ గూర్చియుంచి
దండయాత్రకుఁదఱివేచు ♦ చుండెనధిప. 75

మాలినీవృత్తము.

వరగుణమణిదామా ♦ వంశదుగ్ధాబ్ధిసోమా
దురితరహితకామా ♦ దుష్టసంఘాతభీమా
పరహితరఘురామా ♦ భక్తిపూతాత్మసీమా
నిరుపమరమరామా ♦ నృత్యసంభావ్యధామా. 76

ఇది శ్రీ బుచ్చివేంకయామాత్యతనయ సకల
సజ్జన విధేయ ఆదిపూడి సోమనాథ నామ
ధేయ ప్రణీతంబైన శ్రీ కృష్ణదేవ
రాయచారిత్రంబునందుఁ
దృతీయాశ్వాసము
సంపూర్ణము.

---

శ్రీ

# కృష్ణదేవరాయ చరిత్రము.

## చతుర్థాశ్వాసము.



కరధర్మవిహారా
లోకోత్తమదానవీర ♦ లోభవిదూరా
ప్రాకటబుధమందారా
నాకాధిపగురువిచార ♦ నయసంచారా. 1

వ. అవధరింపుము. 2

ఉ. అయ్యుదయాద్రిఁగృష్ణవిభుఁ ♦ డవ్విధినోర్చితదీయనాయకుం
జయ్యనఁబట్టితీసికొని ♦ చన్నయుదంతముకర్ణగోచరం
బయ్యెనొ లేదొ తత్క్షణము ♦ యగ్గజనాథుఁడపారసేనతో
నొయ్యననెత్తిరాఁదొడఁగె ♦ నుద్ధతిఁగన్నడసార్వభౌముపై౯. 3

వ. అట్లుకళింగనాథుం డగు ప్రతాపరుద్రుండు రుద్రప్రతాపుండై కొండవీట నెచ్చరికనుండ శూరాగ్రేసరుం డగు తన వీరభద్రకుమారునకు సూచించి యియ్యవసరంబున నతనికిఁ దోడుసూప గోల్కొండ నవాబగు కులికుతుబ్షా నియ్యకొలిపి గజపతియును తనబిరుదు సార్థకంబు సేయు పదుమూఁడువంచల సమదకుంజరంబులతోడను రంగదుత్తుంగ తరంగంబులం బోలు నిరువదివేల తురంగంబులతోడను నరిజనభీకరం

బులైన యయిదులక్షల కాల్బలంబులతోడను సముద్రం
బుపొర్లి వచ్చుచుండు చందంబున సమర సంభ్రమసంరం
భంబులతో సరభసంబునఁ దరలివచ్చుచుండె. 4

చ. అదివిని నంత నారిపు కృ♦తాంతుఁడు కృష్ణమహీంద్రమౌళి దాఁ
గదనకృశానుమూర్తులన ♦ ఖండప్రతాపులదండనాథులన్
సదమలభక్తియుక్తులవె ♦ సంబిలిపించి యథార్హసత్కృతిన్
ముదమొదవించి పల్కె నరి♦మూర్ఖతమాన్పు తెలుంగు దేటగాన్

ఉ. తేపకుఁ దేపఁబోయి మన ♦ దేశము కోశము రూపుమాపిసం
తాపము దెచ్చు కోకరిపు ♦ దర్పము నంతయు నొక్కపారిగా
మాపుట మేలుగా ధ్యెయస ♦ మానపరాక్రమమూర్తులార మీ
రీపరమార్థముం దలఁచి ♦ యేచిన మీకు నసాధ్యముండునే. 6

సీ. శత్రుచమూ మేఘ♦ఝంఝానిలంబులై
కలనికిఁ గాల్ద్రివ్వ♦తుళువదొరలు
వైరిపర్వతపఙ్క్తి ♦ వజ్రాయుధంబులై
యని వెండ్లిగా నెంచు♦ తెనుఁగువారు
పరిపంథిగహనాళి ♦ పావకజ్వాలలై
సమరోత్సుకత మించు♦ సైన్యపతులు
అరితతితామసీ♦హరిదశ్వమూర్తులై
బవరంబునకు ♦ దూఁకువరబలములు
గలిగితాండన మాడెడు ♦ కన్నడంబు
జగములన్నియు మెట్టినఁ ♦ జక్కఁడంపఁ
జాలియుండఁగఁ గటకోపి ♦ పీలికంబు



నొక్కలెక్కగ నెంచునే ♦ యోధులార. 7

చ. అనినధరాధినాథునకు ♦ నందఱు గేలు మొగిడ్చి దేవరా
యినుకరదీధితిం బడసి ♦ యించుక చంద్రుఁడు వెల్గినంతనే
దివకరుఁ బోలఁగాఁగలఁడె ♦ దివ్యతరంబగు మీప్రభావమే
గనుగొన మాకు నూఁత ♦ నుతి కన్నడలక్ష్మికి నేతభూవరా. 8

ఉ. కానమహీంద్ర చంద్రరిపు ♦ గర్వతమోదివసేంద్ర మాకు మీ
రానతి యిచ్చినన్ గవిసి ♦ వ్యాఘ్రతతుల్ హరిణాళిఁ జీల్చు చం
దానవిరోధితండముల ♦ దారుణవృత్తిని గూల్చి మోదసం
ధానజయేందిరం దమకుఁ ♦ దప్పక తూర్తుము పేంద్రగౌరవా. 9

మ. అనినావారలఁ గృష్ణభూధవుఁడమం ♦ దానందసంధానసూ
చనకారుణ్యకటాక్షవీక్షణసుధా ♦ సారప్రసారంబుగాఁ
గని సైన్యంబులతోడ రేపకడ రాఁ♦గం జెప్పి తాంబూలచం
దనహారంబుల సత్కరించి కొలువుం♦ జాలించి యామీఁదటన్

శా. ఏకాంతంబున మంత్రిఁజేరి యరితో ♦ నేరీతి వర్తిల్లినన్
సాకల్యంబుగ గెల్పుగల్గఁగలదా ♦ సన్మార్గముం జూపఁగన్
భూకాంతుం డడుగం గనిట్లు దెలిపెన్ ♦ బుద్ధీశసురాచార్యతో
నేకీభావము గాంచి తూఁగు సచివుం♦ డెంతే ప్రమోదంబుతోన్

సీ. బలములెల్లను నాల్గు ♦ భాగమ్ములుగఁ జేసి
యొకటి నిప్పురమున ♦ నుంచవలయు
నొకసేన యదివొయి ♦ యుద్దండవృత్తిగో
ల్కొండదండన్ముగాచి ♦ యుండవలయు
నొండు సైన్యముతోడ ♦ దండిమగల్జని

కొండవీటినిముట్టి ♦ కూల్పవలయు
నొకదళముంగొని ♦ యుత్కళేశునిదాఁక
యుర్వీధవేంద్రమిా ♦ రూనవలయు
నిట్టులుబువడించి ♦ యేత్తైఱచేమించి
యేపుఁజూపిశత్రు ♦ రూపుమాపి
చెలగవలయుమిారు ♦ సిరులందిచెల్వొంది
దేవపతినిదెగడు ♦ ఠీవితోడ. 12

చ. అనిననృపాలమౌళితన ♦ యాప్తునమాత్యుహితోపదేశముం
గొనితగినట్లుకార్యములఁ ♦ గూర్చిపురీరణయాత్రఁజాటఁగా
ననిచియొకింతపోయిగన ♦ నంతిపురంబునకేగియుర్వ్యేలన్
దనసతులిద్దఱెగ్గడల ♦ ధర్మవిధింగొలువంగనూఁగుచున్. 13

ఉ. చిన్నమదేవిఁజూచిచెలి ♦ చిన్నిపద్దెమొకండుసెప్పినా
మన్ననఁబొందవేయనుడు ♦ మానినిమంజులసుస్వరంబుతో
సన్నుతశంకరాభరణ ♦ సంగతిగూర్చినృపాలుమానసం
బెన్నఁగరానిసౌఖ్యమున ♦ నెంతయుఁదేలఁగఁ బాడెసీక్రియన్

శా. దేవానీవునిశాటసంఘములను ♦ ద్వేపించిచెండాడనీ
ప్రావీణ్యంబులుసూడఁగోరుదుగదా ♦ ప్రాణేశమన్నించి న
న్నీవెంటంగొనిపొమ్మునేఁడుకరుణ ♦ న్నేఁజూచియేతెంచినీ
దేవీసంఘముకెల్లఁజెప్పెదుభవ ♦ ద్దీప్తప్రతాపోన్నతుల్. 15

తే. గీ. అంచుఁగర్ణామృతంబుగా ♦ నంతరంగ
మల్లరఁబాడినయట్టియా ♦ యతివకంఠ
మందుసత్తారహారంబుఁ ♦ బొందుపఱచి



కృష్ణభూపాలుఁడిట్లనెఁ ♦ గృపదలిర్ప. 16

ఉ. భాగవతంబులోని పెఱ♦భాగములన్నియుఁగట్టిపెట్టియా
భాగములోనిపద్దెముసు ♦ భవ్యతరంబుగఁబాడిభావముం
బాగుగఁదెల్పినందులకుఁ ♦ బాడిగనిన్నునుదిర్మలాసతిన్
నేఁగొనిపోదువెంటరమ♦ణీరమణీయములెల్లఁజూపఁగన్ 17

క. కాంతామణులకు మిాకున్
గాంతునిరణకౌశలంబు♦గాంచుటయును శ్రీ
కాంతునిదర్శనమబ్బిన
నెంతయుభాగ్యంబుగాశు♦భేక్షణలారా 18

క. ఈదండయాత్రతోడన్
వేదండసుయానలార ♦ వెడలుఁడుమిాకున్
గోదండపాణిఁగనసగు
నేదండంజూడవేడ్క ♦ లిగురొత్తంగన్ 19

ఉ. ఏవగకుంజలింపకము ♦ నీంద్రులకైవడివెల్గుశైలముల్
గేవలమన్యరక్షణమె ♦ కృత్యముగామనుకాననాళియున్
బావనజీవనంబులయి ♦ భాసిలుచుండునదీప్రవాహముల్
దేవునిసత్ప్రభావమును♦దెల్పిసుఖంబులఁగూర్చురండటన్ 20

తే. గీ. అనినవారలుహర్షంబు ♦ మనమునిండఁ
గనులఁగురిసెడిసంతోష ♦ కణముగుండఁ
దెలిపివల్లభునుల్లంబు ♦ నలరఁజేయఁ
గాల్యకృత్యములెల్లను ♦ గడపివిభుఁడు. 21

క. ఆరాత్రిరిసుఖశయ్యన్
భూరమణుఁడు నిద్రవోయెఁ ♦ బురుషోత్తమునిన్
గూరిమితోమదినిడిన
ధీరులునిద్రించు తెఱఁగు ♦ దెలియఁగనధిపా. 22

వ. ఇట్లు నిద్రించి. 23

క. తెలతెల్లవాఱునంతన్
మెలఁతలసంగీతములను ♦ మేల్కాంచిహరిన్
దిలకించిమదినినంగము
పులకింపఁగ లేచికార్య ♦ పుంజముదీర్చెన్. 24

వ. తదనంతరంబున మార్తాండుండు దనబాలారుణ కిరణంబులఁ బ్రపంచంబు నలంకరించుచుండ సభామండపంబున నవరత్న ఖచిత సింహాసనం బధిరోహించి సమరసన్నాహ సంభ్రమోద్ధాత్తులగు మహావీరులు గొలువ సజ్జన సన్మాన్యుండగు నక్కృష్ణసార్వభౌముండు సుధర్మాసీనుండగు శునాసీరుచ్ఛందంబునఁ బేరోలగంబుండి. 25

తే. గీ. రాజధానినిగోవింద ♦ రాజనాము
వైరినృపభీమునొకనిగా ♦ వలికినుంచి
యతనివశమునవలసిన ♦ యంతబలము
నిచ్చిబలుహెచ్చరికనుండ ♦ నెచ్చరించి. 26

క గోల్కొండదండయవనుల
కుల్కాపాతంబువోలె ♦ నుండఁగననిచెన్
బల్కడఁకదాల్చియాజిన్



నిల్కడతోఁబోరునొక్క ♦ నిరుపమవీరున్ 27

గీ. దండిమగలకేని ♦ దలఁపనసాధ్యమౌ
కొండవీటిబలముఁ ♦ గులగఁదీయ
శౌర్యధైర్యకార్య ♦ చాతుర్యములఁ బేరు
గొన్నతిమ్మనార్యుఁ ♦ గోరిపనిచె. 28

ఉ. వారలవార్యవీరులరి ♦ వర్గవనాళిదవానలంబులై
ధారుణిదిర్దిరందిరుగు ♦ ధాటినిబోయిరిధంధణార్భటిన్
భేరులుమ్రోయుచుండరిపు ♦ భీకరమూర్తులుసద్భటావళుల్
సేరికెలంకులంగొలిచి ♦ సింహనినాదము సేయుచుండఁగన్ 29

ఉ. అంతగజేంద్రునోర్చుతమ ♦ కాతిశయంబునమేరుశైలమున్
వింతగడిగ్గనట్టిహరి ♦ వీఁకనుగృష్ణనృపాలసింహుఁడ
త్యంతభరమ్మునండిగియె ♦ హాటకరత్నమృగేంద్రపీఠమున్
జెంతలముందువెన్కనిజ ♦ సేవకరాజిపరాకుదెల్పఁగన్ 30

గీ. ఇట్లుగద్దియడిగ్గిన ♦ రేశ్వరుండు
సమరసన్నాహసంరంభ ♦ సంభ్రమముల
బలసిసామంతులంతంతఁ ♦ గొలిచిరాఁగఁ
గొలువుకూటంబువెడలిమో ♦ సలనుజేరి 31

సీ. తద్ద్వారమునహేమ ♦ ధరణీధరంబునా
శృంగారమైయొప్పు ♦ సింధురంబు
మీఁదఁగాంతులుసల్లు ♦ మిసిమియంబారిపై
నెక్కికూర్చుండెను ♦ హేంద్రనిభుఁడు
దుందుభిధ్వానముల్ ♦ తుములంబులైమ్రోసె

జయనిస్వనమ్ములు ♦ చదలముట్టఁ
గుసుమవర్షంబులు ♦ గొల్లగాఁగురిసెను
బుధులదీవెనలప్ర ♦ బోధమెసఁగ
మొనలుదమతమనాథుల ♦ నెనసినిలిచె
దినకరుఁడుగగనమధ్యాన ♦ దీప్తిమెఱసెఁ
బురజనులమానసంబులు ♦ పొంగిపొరలె
దృశ్యముత్సాహరూపమై ♦ తేజరిల్లె. 32

గీ. అపుడుబంగరుటందపు ♦ టందలముల
నెక్కిరాణులువచ్చి న♦రేంద్రువెనుక
నలరుచుండిరిదాసీజ ♦ నాళికొలువ
నంతనంతయుసంసిద్ధ ♦ మంచుఁదెలుప. 33

సీ. ఠంఠణప్రమోఘఘం ♦ టానినాదంబులు
ఘీంకారములతోడఁ ♦ గేళిసలుపఁ
గంఖాణములయొక్క ♦ రింఖారవమ్ములు
హేషాధ్వనులతోడ ♦ నేపుసూప
రణభూరినిస్సాణ ♦ ధణధణధ్వానముల్
రథనేమిపటల్లతో ♦ రాచియాడ
వీరహుంకారముల్ ♦ విజయస్వనముతోడ
నెయ్యమ్ము నెఱపుచు ♦ వియ్యమంద
చతురచతురంగబలముల ♦ సందడులకు
శత్రునృపులగుండెలెల్లను ♦ సంచలింప
వసుధవేగభరమ్మున ♦ వడఁకుచుండ



ధాటితోనేగెశ్రీకృష్ణ ♦ ధరణిధవుఁడు. 34

వ. ఇట్లు. 35

మ. ప్రలయాభీలమహాగ్నిజాలములలో ♦ పంబెన్నుహస్త్యావళుల్
గలగంభీరపయోధివీచికలవీఁ ♦ కన్నవ్వహారట్టముల్
విలయార్కప్రతిమానవిక్రమమహా ♦ విద్యాప్రవీణుల్ భటుల్
గలసర్వోత్తమసేనదన్నుఁగొలువఁ ♦ గాఁబోవుచుండ్రోవలోన్

మ. వినుకొండన్వడిఁదాఁకిజగ్గరితనా ♦ భిస్థానిగావించిమిం
చినశస్త్రాస్త్రపరంపరానిహతిని ♦ ర్జీవంబునాఁజేసిచే
కొనికారుణ్యసుధాప్రవర్షములసం ♦ క్షోభంబుఁజల్లార్చియా
జననాథాగ్రణిచండమారుతమునో ♦ జన్ బోవుచున్ ముందటన్

మ. కనినాగార్జునకొండపైకడరిసా ♦ గ్రక్రోధతామ్రాక్షుఁడై
ఘనశస్త్రాస్త్రప్రయోగముల్గొలిపిని ♦ ర్ఘాతప్రఘాతంబుగాఁ
గొనియెన్ దుర్గమునేకరీతిగమహా ♦ ఘోరంబుగాఁబోరిస
జ్జనసన్మాన్యుఁడుశౌర్యధైర్యకరుణా ♦ సన్మూర్తిసామాన్యుఁడే.

ఉ. అచ్చటినుండి యద్భుతర ♦ యమ్మునఁదార్ఢ్యనిమించవచ్చివి
వ్వచ్చుఁడుమెచ్చుశౌర్యమున ♦ ప్రచ్చనుబెల్లముకొండనుచ్చు [గాఁ
బచ్చడిగాఁగదంచెఁబరి ♦ పంథిబలమ్ములఁబాహియంచువే
వచ్చినవారిఁగాచెసరి ♦ వత్తురెకృష్ణునకెవ్వరెచ్చటన్ 39

ఉ. పిమ్మటఁబోయిపోయిపృథి ♦ వీపతికృష్ణుఁడుకృష్ణవేణితీ
రమ్మునదండులన్విడిసి ♦ రమ్యనదీసరసీతటాకముల్
గొమ్మలఁగూడిచూచుచును ♦ గోరినవారలకోర్కిదీర్చుచున్

నెమ్మదినీశు నెంచుచు వి♦నీతుని శత్రునిబొంచుచుండఁగన్. 40

ఉ. చెంతను గృష్ణకావల వి♦శేష బలంబులఁ గూడి వైరియా
వంతయు భీతి లేక కద♦నార్థము దాఁ బఱతెంచియున్న వాఁ
డెంతయుఁ జాగు లేదనుచు ♦ నేర్పడ దూత యొకండు దెల్పెనా
రాంతకమూర్తియైన సమర♦మందు నటించెడు కృష్ణమూర్తికిన్.

వ. అంత. 42

ఉ. చేతుల తీఁట మాపికొన ♦ జేకురె నేఁటికటంచు నుబ్బుచున్
నీతివిశారదుండు ధర ♦ ణీపతి కృష్ణవిభుండు సేనలన్
జేత మెలర్పఁ దీర్చి గురు ♦ శేముషి వారి హృదంతరంబులన్
బ్రాతిగ శౌర్యపావకుఁడు ♦ రాజిరఁగ ల్గొనఁ బల్కె నీక్రియన్. 43

శా. కౌంతేయ ప్రతిమానులార మిముస ♦ త్కర్ణాట మార్తాండులన్
దంతీశుం డెదిరింపఁ గాఁదొడఁగెఁ ద ♦ ద్ధ్వాంతంబు సాంతంబు దు
ర్దాంతంబై విలసిల్లు తేజమునవి ♦ ధ్వంసంబు గావించి స
త్కాంతుల్ జల్లుఁడు దిక్కులన్ సుజనహృ ♦ త్కంజాతముల్ రం
[జిలన్. 44

ఉ. తేజము దాల్చువారలకె ♦ దేవుఁ డొసంగును దేశకోశముల్
తేజము సూపువారలనె ♦ దేవతలందఱు మెత్తురిద్ధరన్
దేజము ప్రాణమైయెసఁగు ♦ దేశహితైషులకెల్లఁ గావునన్
దేజముఁ జూపి కన్నడపు ♦ తేజము దేజరిలింగఁ జేయుఁడీ. 45

చ. అనిన జయస్వనంబు చద ♦ లంటఁగ నార్చిరి ఢంఢణార్భటిన్
ఘనతర భేరిభాంకృతులఁ ♦ గాంతుని కృష్ణుని సంతసంబునన్
మనుఁగఁగఁ జేసిరత్తులను ♦ మోదజలంబుల రాల్చి రాజకై



మును కొను తత్తరంబులను ♦ మోములఁ జాటిరి వారలొక్కటన్

వ. అంత నక్కృష్ణసార్వభౌముండు. 47

చ. సుకముగఁ గృష్ణ దాటియుటుఁ ♦ జొచ్చి దురంబొనరింపఁ గోరి తే
సకల చమూసమేతముగ ♦ సాగెద దూరము వెన్కకంచు దాఁ
బ్రకటముగాఁగఁ దెల్పె పరిపం ♦ థికి దాని నిరాకరించి వాఁ
డకసకెమాడి సైన్యముల ♦ నేటికిగట్టునఁ బెట్టెఁగావునన్ 48

గీ. దాని నాలించి కీలిచం ♦ దమున మండి
సేనలను గృష్ణ దాఁటంగ ♦ సిద్ధపఱచి
మొదట నావలితటమున ♦ మొనసియుండు
నరులను ఋమాడ శ్రీకృష్ణుఁ ♦ డడరి తోడరి. 49

ఉ. కాలవలాహక ప్రతిమ ♦ గంధగజాళి నినూలుకొల్పినన్
గేళిగఁ గృష్ణ దాఁటి తమ ♦ కేల మహాముసలంబులూనియా
భీలగతిన్ విదేభములు ♦ విజ్జున వీచుచు వ్రేయఁ సాగవా
తూలహతిం దొలంగి చను ♦ తోయదముల్వలెఁ బారి రాదిపుల్. 50

ఉ. సన్నయెఱింగి కృష్ణపతి ♦ సర్వబలంబులతోడఁ గూడి యే
బన్నము గల్గకుండ వర ♦ వాహినిఁ గృష్ణను దాఁటియంతఁ జే
సన్న సమస్త సైన్యముల ♦ సన్నిధిఁ జేరిచి శత్రుజాలముల్
పన్నెడు మాయలం బడక ♦ వర్తిలఁ దెల్పి నృపాలుఁ డంతటన్. 51

ఉ. చెంగటనొప్పు శైలమునఁ ♦ జెన్నలరారుగుడారమెత్తియ
ర్ధాంగులనంపు నుండి సమ ♦ రాతిశయంబులఁ జూడఁ గొల్పి యే
భంగము గల్గకుండ రణ ♦ పార్థులఁ బల్వురఁ జుట్టనుంచియా
సంగరకోవిదుండు విల ♦ సచ్ఛిబిరంబును జేరె నంతలోన్. 52

గీ. తరణిమఱునాఁడుకృష్ణ ప్ర♦తాపసరణిఁ
జూడరావేఁగఁబోయెడు ♦ జాడఁగ్రుంకె
నంతధరణీంద్రుఁడర్హ కృ♦త్యములసలిపి
నెమ్మదిగరాత్రిసుఖశయ్య ♦ నిద్రఁబోయి. 53

ఉ. మంగళవాద్యములెస్సలఁగ ♦ మానవనాథుఁడుపేంద్రుఁగొల్చు
చున్
సంగరసంభ్రమంబునను ♦ సన్నమయంబునలేచిసద్విధుల్
సాంగముగాఁగఁదీర్చిప్రభ ♦ సంబెసఁగన్ రణభేరివేయఁగాఁ
బొంగుచుఁ దెల్పెసిద్ధమయి ♦ భోరునమ్రోగఁగఁ జొచ్చెదుం
దుభుల్. 54

ఉ. అంతననంతసైన్యముమ♦హాహవకేళికళానురక్తమై
చెంతలఁదీర్చిలిల్వనృప ♦ సింహుఁడువానికిసంతసంబుగా
దంతిపయిన్ సవారియయి ♦ ధంధణధాణధణాధణార్భటిన్
శాంతనవప్రతాపమున ♦ శత్రువుమీఁదికిఁదర్లెనుగ్రుఁడై. 55

చ. అదివినియుత్కళాధిపుఁ డ♦హంకృతిసాగరుఁబోలుసేనతోఁ
గదలికృశానుమూర్తియనఁ ♦ గ్రాలుచుభేరిధవంధమార్భటిన్
గదిసెనుదానిగాంచియరి♦కాలకృతాంతుఁడుకృష్ణమూర్తిదా
మదగజమండలంబులను♦మార్తుఱఁజీకొనఁబెట్టెముందటన్.

చ. అవితమకేలదండముల ♦ నందిబలంబులతివ్వతివ్వనన్
బవిగతిప్రేయుచున్ గదిసి ♦ బాదుచుమింటికినెత్తిమోదుచున్
గవియుచుఁద్రోయుచున్ గడలఁ♦గన్గొనిపెల్లగఘీంకరించుచున్
వివిధవిధమ్ములన్ రిపులు ♦ విహ్వలమందగఁబోరెనుగ్రతన్. 57



శా. అంతంబార్శ్వములందుఁగోల్బలములన్ ♦హార్యక్షభీమంబులన్
గుంతంబుల్గరవాలముల్గదలుస♦తోక్కదండముల్దాల్చియ
త్యంతక్రోధముతోడఁబైనడరికో♦ల్తల్ సేయఁగాఁబంపెభూ
కాంతానాథుఁడుకృష్ణుఁడాయరులదు♦గ్గర్వంబుఁదూలింపఁగన్

ఉ. పంపినవారుకోల్బలుల ♦ భంగిఁబయింబడిశత్రుసైన్యమున్
జింపియుఁజంపియున్ జమరి♦చెక్కియునొక్కియుఁ జీల్చినైచి
[యున్
దెంపుగనొక్కదెబ్బఁగడ♦తేర్చియు గుప్పనఁగూల్చినల్చియున్
బెంపడఁగించిశత్రుదిపుని ♦ భీతమనస్కునిజేసిరార్చుచున్. 59

శా. వెన్కన్ గృష్ణుఁడునిల్చెశత్రువితతుల్ ♦ వెన్నిచ్చిపోకుండఁగాఁ
గిన్కన్ సింధురయూథమున్ నుఱుముచున్ ♦ గేల్తెత్తిఘీంకార
[ముల్
పూన్కిన్ జేసినవానిజూచికడకుం ♦ బోకుండరక్షించుచున్
మున్కల్ మున్కలుగాగనైరులతలల్ ♦దోరించిదోర్లించుచున్

ఉ. అత్తొలితాఁకునల్గడ భ♦యంకరమైకనుపట్టెశీర్షముల్
మొత్తములైధరంబడియె ♦ మొండెములంతటనిండెనేరులై
నెత్తురుపారఁజొచ్చె ధర♦ణీధరముల్వలె నుండెతొండముల్
గత్తులఁగత్తిరింపఁబడి ♦ గంధగజప్రతతుల్గతాసులై 61

గీ. అంతమండల గతిదాఁకి ♦ యలసియున్న
సేనలకు నెల్లఁజేపిచ్చి ♦ చేరఁదీసి
కృష్ణుఁడొక మొనగాఁదీర్చి ♦ జిష్ణుపగిది
నుత్తమాశ్వంబుపైఁ ♦ జెంతనొప్పనంత 62

గీ. సమరమొకయింత యాఁగిన ♦ సరణిదోఁప
గజపతియుఁ దేఱి బలముల ♦ కలకదీర్చి
కృష్ణుపైఁ గ్రొల్లఁ జూచిన ♦ కెరలియతఁడు
వైరివేఁటాడనూల్కొల్పె ♦ వీరవరుల. 63

ఉ. అంతటఁ బానయైమఱియు ♦ నందఱఁగూడి మెలంగుచుండు భూ
కాంతుని ప్రేమలోఁదఱుమఁ ♦ గాలకఠోరకరాళమూర్తులై
పంతముమీఱువారలురు ♦ బాహుబలంబును బుద్ధికౌశలం
బెంతయుఁజూపుచున్ రిపుల ♦ నెత్తెఱఁదాఁకిరి నూకిరుద్ధతిన్. 64

గీ. ఇట్టులుఱవడించి ♦ యేచిననొక్కటఁ
జలముతోడశత్రు ♦ బలముగూడ
నుక్కుమీఱఁదాఁకె ♦ నొక్కింతకృష్ణుండు
వెఱఁగుపడఁగవైరి ♦ వీఁగిపడఁగ. 65

ఉ. అప్పుడురోషభీషణహు ♦ తాశనమూర్తిగఁ గృష్ణుఁడార్చుచున్
రొప్పఁదొడంగె వైరులను ♦ రుద్రసమానులు దండనాథులున్
గుప్పలుగుప్పలై పడఁగఁ ♦ గూల్పఁగఁజొచ్చిరి శత్రుజాలమున్
దెప్పరమౌనటుల్ రిపుల ♦ తేజమడంచిరి సైనికోత్తముల్. 66

సీ. ఒక్కొక్కవేదండ ♦ ముఱిమినట్లులుఘీంక
రించిచిక్కినవారిఁ ♦ ద్రుంచుచుండె
నొక్కొక్కరాహుత్తు ♦ యోధులెందఱినేని
నుక్కఱఁజెండాడి ♦ యొప్పుచుండె
నొక్కొక్కభటుఁడుదా ♦ నిక్కిపల్వురఁబట్టి
తుక్కుతుక్కుగవడిఁ ♦ జెక్కుచుండె



నొక్కొక్కవిలుకాఁడు ♦ నెక్కొనిబిట్టేసి
పెక్కుఱఁగూల్చి పెం ♦ పెక్కుచుండె
నార్చికృష్ణుండుముందుస ♦ ప్తార్చియగుచు
శత్రువనములదహియించి ♦ సైన్యములకు
మార్గదర్శకమూర్తియై ♦ మంచుచుండె
గగమధ్యానరవియిది ♦ గాంచుచుండె. 67

ఉ. అత్తఱినుత్కళేశుఁడు ర ♦ ణావనిఁబాయక శేషసైన్యమా
యత్తముచేసి నూల్కొలిపి ♦ యంతటఁ దానుగసుండి యార్చు
[చున్
మత్తగజంబుపెల్లడరు ♦ మాడ్కిచరించుచుఁ గృష్ణసేనలన్
మొత్తఁదొడంగె వారలును ♦ మూఁగికలంచిరివీరినుగ్రులై. 68

వ. ఇట్లు వీరావేశంబున జయలక్ష్మిం జేకొను సంభ్రమోత్సాహంబులతో నిరుగెలంకులవారును ఘోరంబుగఁదలపడి సంకుల సమరంబు సలుపుసమయంబునఁ దొండంబులు ఖండింపంబడి కండకండలుగ రక్తంబు ప్రవహింపఁ బుడమింబడి కొండపిండులవలెనుండు వేదండతండంబులతోడను గాళ్లునఱకఁబడి ముందఱికి మ్రొగ్గిమ్రగ్గిన తురంగంబులగమ్ములతోడను శిరంబులు దెగిపడిన వీరభటసహస్రంబుల మొండెంబులతోడను సంగరాంగణంబంతయుఁ గటికవానిదుకాణంబు చందంబునఁ గాళికామందిరంబు వడువున మాంసాహారులవంటయిలు పోలిక వ్యాఘ్రంపు గుహోపాంతంబుకరణి నత్యంత భీభత్సంబై యుండె. 69

ఉ. అప్పుడు వైరిలోకతిమి♦రావళి హేళియు రాజమౌళియై
యొప్పెడు కృష్ణుఁడొక్కపరి♦ యోధులనాదట నూలుకొల్పి దాఁ
గుప్పలు తిప్పలై పడఁగ♦ గూల్చియరాతుల నార్చి పేర్చినన్
జెప్పనదేమి హస్తిపతి♦ సేనలతో వెనుఁజూపె నార్తుఁడై. 70

క. అక్కరణిఁ బారు వైరిన్
జక్కఁగ మదమణఁచి కృష్ణ♦ జనపతి కొనియెన్
గ్రక్కున హరులన్ గరులన్
దక్కిన మణిభూషణముల♦ ధననిచయములన్. 71

గీ. విజయలక్ష్మి నిట్లు♦ వేడ్కతో వరియించి
విశ్వవిభుని హృదయ♦ వీధి నుంచి
వివిధగౌరవముల♦ వీరులన్ సతులను
దనిపి సంతసించి♦ ధర్మవిధిని. 72

ఉ. అచ్చటనుండి కృష్ణవిభుఁ♦డాహవదోహళమైన సేనతోఁ
జెచ్చెరవచ్చి తిమ్మరసుఁ♦ జేరి మహోద్ధతిఁ గొండవీడు దా
హెచ్చిచకిన్కముట్టి వసు♦ ధేశుఁడు రెండు నెలల్ గలంచినన్
వ్రచ్చువిధంబుగానకది♦ వస్పతి తేజము మీఱ నుగ్రుఁడై. 73

ఉ. కన్నడవీరులార మన♦ గర్వము ఖర్వమయ్యెని మాతకున్
గ్రన్నన భూషణంబగుచుఁ♦ గ్రాలఁగ సీపరి పంథిదుర్గమున్
జెన్నుగ మీఱ లక్షణము♦ సేయుఁడు నేఁడిది గొన్నఁగాని నే
నన్నము నీరముం గొనన♦ నష్టసుఖంబులు రాజగర్హ్యముల్.

చ. అనిపుగి కొల్పి యన్నృపతి♦ యబ్ధితరంగపరంపరాళినా [డన్
మొనలఁ బయిన్ బయిన్ బనిపి♦ ముఖ్యముగా సచివుండు తోడ్ప



దినకరుఁ డద్రిగుంకు తఱి♦ దివ్యపరాక్రమరేఖ శోభిలన్
గొనియెను దుర్గమున్ సమర♦ కోవిదవర్గము వాలి స్వర్గమున్. 75

వ. ఇట్లు శాలివాహనశకమందలి 1437వ వర్షంబునకు సరియగు యువనామసంవత్సరాషాఢ శుద్ధైకాదశీ దినంబునఁ గొండవీడుం గొని యందుండిన ప్రతాపరుద్రగజపతి కుమారుఁడగు వీరభద్రగజపతి, వీరమహాపాత్రుఁడు, రాచూరి మల్లఖానుఁడు, పూసపాటి రాచిరాజు, శ్రీనాథరాజు, లక్ష్మీపతిరాజు, జన్న్యామలకసవాపాత్రుఁడు, పశ్చిమబాలచంద్ర మహాపాత్రుఁడు మొదలగు మహావీరులఁ జెఱఁబట్టి వారి శౌర్యధైర్యంబులకు మెచ్చి శరణంబొసంగి తద్దుర్గంబునకుఁ బాలకునిగఁ బరతంత్రభేదనస్వతంత్రుఁడగు నాదెండ్లగోపనమంత్రిని నియమించి, తద్బహుళద్వాదశీ భానువాసరమ్మునఁ గృష్ణానదీతీరమందలి ధరణికోటకు విజయముచేసి యమరేశ్వరుని దర్శించి బహువిధదానంబు లొనర్చి బరమేశ్వరు నారాధించి. 76

క. అటనుండి కొండపల్లికిఁ
దటుకున నరుదెంచి సమర♦ దాహము మీఱన్
గుటకలు వేయుచుఁ గోటన్
జటిమోద్రేకంబు మించఁ♦ బట్టఁ దొడంగెన్. 77

గీ. మూఁడు మాసంబులద్దాని♦ ముట్టడించి
యాగ్రహంబునఁ బోరి♦ యహర్నిశంబు
నెట్టకేలకుఁ గొనియె మ♦ హీశ్వరుండు

ప్రథనసాహససత్కళా ♦ పండితుండు. 78

క. అటులుగొనిదుర్గమందలి
కటకేశ్వరుసతినిసుతుని ♦ గడుమన్ననతోఁ
జటులగతివిజయనగరికిఁ
బుటభేదనమణికిబంపె ♦ భూధవుఁడంతన్. 79

గీ. కొండపల్లెనుండి ♦ కోనసీమకునంటి
కొనియెఁజిన్నచిన్న ♦ కోటలెల్లఁ
బొట్టునూరికడను ♦ భూరిజయస్తంభ
మొకటినాటిగెల్పుఁ ♦ బ్రకట పఱిచె. 80

వ. తదనంతరంబ. 81

ఉ. అన్నరనాథచంద్రుఁడు మ ♦ హాహవకేళికళావిలాసుఁడై
తన్నుఁజమూపతుల్ గొలువ ♦ ధాటిమెయిన్ వడిఁబోయిపోయి పే
రెన్నికఁగన్నదుర్గముల ♦ నేకములంగొనియొక్కపెట్టునన్
గ్రన్ననఁదాఁకిచేకొనియె ♦ రాజమహేంద్రవరంబుడంబుతోన్.

క. అంతన్ భూకాంతుఁడుతన
కాంతలతో వెడలి ఘోర ♦ కాంతారములన్
శాంతనదీప్రాంతమ్ములు
స్వాంతము పెల్లుబ్బఁజూచి ♦ సాగుచునెదుటన్. 83

మహాస్రగ్ధర. కనియెన్ గల్లోలమాలా ♦ కలితజలనిధిన్
గాఢగర్వప్రభేదిన్
స్వనితాభానందఘోషున్ ♦ జనపదనికరా
సన్నలాశేషశోషున్



జనసంతాపైకహారున్ ♦ జలదజనకస ♦
చ్ఛక్తిచేతోవిహారున్
ఘనవిద్యాయోగిభద్రున్ ♦ ఖరకరకిరణా ♦
గ్రఘ్నునిద్రున్ సముద్రున్. 84

వ. అట్లు సముద్రంబుంగాంచి తత్తీరంబునంబోవుచుండి యయ్యు
నంతాకాంతుండు. 85

చ. కడలికినాతిదూరమునఁ ♦ గన్గొనెనొక్కగిరీంద్రమున్ గడున్
బెడఁగగుదానిఁబుష్పఫల ♦ వృక్షలతావళినొప్పుదానిఁ బే
ర్వడసినదాని విశ్వవిభు ♦ భవ్యమహావిభవప్రభావమున్
గడలకుఁజాటి సింహగిరి ♦ నామముచేనలరారుదానిదాన్

గీ. దానిమీఁదికెక్కి ♦ తనకాంతలకుఁజూపె
దివ్యమైనయచటి ♦ దృశ్యమెల్ల
నీశుఁడొసఁగినట్టి ♦ యీక్షణంబులువారు
సఫలమయ్యెననుచు ♦ సంతసింప. 87

క. తరువాతన్నరసింహుని
నరసింహుఁడుసతులతోడ ♦ నానావిధులన్
వరభక్తిఁగొల్చిపొల్చెన్
పరమాహ్లాదమున నూత్న ♦ ప్రహ్లాదుండై 88

వ. ఇట్లు శాలివాహనశకమందలి 1438 వ వర్షంబగు ధాతు
సంవత్సరపు చైత్ర బహుళ ద్వాదశినాఁడు సింహాద్రిదర్శించి
పైఁబైఁదటిమినచ్చినను బవరంబీకపరువెత్తి చనిన యగ్గజపతి
పైఁగడుంగనలి యక్కృష్ణసార్వభౌముండు తత్సమీపమందలి
యొకమహాశిలాస్తంభంబుమీఁద. 89

గీ. కదనమీఁకుండఁబరువెత్తె ♦ కటకనృపతి
యక్షరములివ్విమాసిన ♦ యపుడుగాని
రాఁడుగాబోలునాతోడ ♦ రణముసేయ
భీరువతఁడేడసంగ్రామ ♦ భారమేడ. 90

గీ. అంచువ్రాయించియాక్రింద ♦ నావిభుండు
దీనిఁజెటిచినవాని పత్నినిజమ్ము
నాళములుగట్టువారల ♦ పాలిసొమ్ము
సేయనౌననిలిఖియింపఁ ♦ జేసి తెరలె. 91

వ. ఇట్లాసమరకలాకలాపుండగు నక్కృష్ణరాజబిడౌజుండు దన
పూర్వదిగ్విజయయాత్రం బరిసమాప్తంబు నొందించి. 92

గీ. సంభ్రమోత్సాహములఁబొంగు ♦ సతులఁగూడి
భక్తినెఱపెడుసేనాధి ♦ పతులఁగూడి
ప్రబలదర్పంబుచేమించు ♦ బలముఁగూడి
విజయనగరంబుచెంతకు ♦ వేగవచ్చి. 93

సీ. చంద్రునిరాకకై ♦ చారుచకోరముల్
దమకించుచుండు చంద్రమ్ముమించి
ప్రజలందఱునుదన్నుఁ ♦ బాటించిచూడంగ
వేగిరపాటున ♦ వేచియుండఁ
బతివచ్చువేళకు ♦ పరసతీతిలకంబు
కైసేసిమెలఁగెడు ♦ కరణిమీఱఁ
బట్టణంబంతయు ♦ బహువిధశృంగార
భాసమానంబయి ♦ పఱలుచుండ



నిభముపై నెక్కిశ్రీకృష్ణ ♦ విభుఁడువచ్చి
జనులుదనుఁజూచిజయజయ ♦ ధ్వనులుసేసి
జల్లుమనిపూలనందఱుఁ ♦ జల్లఁజొచ్చె
విజయనగరంబుజయభార్గ ♦ వీపురంబు. 94

క. సతులున్ సేనాపతులున్
జతురంగబలంబుగూడి ♦ చయ్యనవెనుకన్
బతివైభవముంజూచుచు
హితమతిజనుదెంచుచుండి ♦ రెలమినినాథా. 95

వ. ఇట్లుమహావైభవంబునఁ బురంబుప్రవేశించి. 96

శా. దేవాధీశుని గొల్చిదీనతతులఁ ♦ ధీవర్యులం బ్రోచి స
ద్భావంబొప్పఁగదండనాథులనుస ♦ త్కారంబులం దన్విభూ
దేవేంద్రుండుజయోత్సవంబుసలిపెఁ ♦ దేదీప్యమానోద్ధతిఁ
గైవారంబులు గన్నడంబునకుగ ♦ ల్గన్నల్గడన్ భూవరా. 97

మాలినీవృత్తము.

లలితగుణ పవిత్రా ♦ లచ్చమాంబాసుపుత్రా
విలసదమల గోత్రా ♦ విద్వదారామ చైత్రా
బలిసమసుచరిత్రా ♦ బంధుపద్మాళి మిత్రా
బలవద సదమిత్ర ♦ వ్రాతకాలాగ్ని హోత్రా. 98

ఇది శ్రీబుచ్చివేంకయామాత్యతనయ సకలసజ్జన
విధేయ ఆదిపూడి సోమనాథ నామధేయ
ప్రణీతంబైన శ్రీకృష్ణదేవరాయచరిత్రంబు
నందుఁ జతుర్థాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ

# కృష్ణదేవరాయ చరిత్రము.

## పంచమాశ్వాసము.



యుతగుణరత్నాకర
న్యాయదయాచరణధీర ♦ యమలవిచారా
నాయనికులవిస్తారా
మాయాగుణదూరధర్మ ♦ మార్గవిహారా. 1

వ. అట్లు కర్ణాటరాజ్యరమాధురంధరుండగు నక్కృష్ణరాజమహేంద్రుండు పరమాద్భుత ప్రతాపంబున నప్రతాపరుద్రు గర్వోద్రేకంబు దూలించి మహదానందంబున విజయోత్సవంబు గావించి జగత్పూజ్యంబుగ రాజ్యంబు సేయుచుండి. 2

గీ. గజపతిని నోర్చి కొన్నట్టి ♦ విజయమెపుడు
ప్రజలహృదయాన నవ్యమై ♦ ప్రభదలిర్పఁ
జేయఁగా నెంచి నరపాల♦ శేఖరుండు
శిల్పవిద్యాప్రవీణులఁ♦ జేర్చి పురిని. 3

గీ. నాఁటిమయనిర్మితంబైన ♦ కూటమునకు
సాటియన శిల్పనైపుణి ♦ చాలమెఱయ
విజయభవనంబు నాఁగట్టె ♦ వివిధవిభవ
మండితంబగు నొకసభా ♦ మండపంబు. 4



ఉ. ఆవిజయాంకమండపము ♦ నందు మహేంద్రుని వైభవంబునన్
గోవిదకోవిదుండు రిపు♦కుంజరసింహుఁడు గొల్వుదీర్చి సం
భావన సేయుచున్ బుధుల♦ భవ్యదయాపరమూర్తియై ప్రజన్
గేవలపుత్రవత్సలతఁ ♦ గృష్ణువిధంబునఁ బ్రోచుచుండఁగాన్. 5

ఉ. అన్నిటికోర్వఁ జేసి మన ♦ కన్ని సుఖంబులఁ గూర్చువాఁడు స
ర్వోన్నతుఁడైన యీశ్వరుఁడ ♦ హా మనభాగ్యమటంచు భూ[జనుల్
సెన్నుగ వంగి సన్నుతులు ♦ సేయఁగ నేఁపు హిమంతకాలమా
సన్నమయెన్ బగల్ మిగుల ♦ సన్నముగాఁ దొడఁగెన్ గ్రమం[బుగన్. 6

క. హిమకరుఁడు సుమశరుండును
దనుతమకరశరములకును ♦ దగినపదను రాన్
దమిఁ దోమిక డుగు హేమం
తము వచ్చెన్ దంపతులకుఁ ♦ దముకము హెచ్చెన్. 7

క. హేమంతుఁ డేలఁ జొచ్చినఁ
జేమంతులు నాణెములుగఁ ♦ జెల్లఁ దొడంగెన్
సామంతుఁ డయ్యె సూర్యుఁడు
శ్రీమంతములయ్యె నిశలు ♦ శీతాఫలముల్. 8

శా. ఆహేమంతమునందు నొక్కదినమా♦ యాస్థానరంగంబులో
నాహా స్త్రీద మదాపహారుఁ గొలువన్ ♦ హర్షప్రకర్షంబుతో
నూహాపోహల సత్కవిత్వరచనో♦ ద్యోగప్రగల్భుల్ మ[హా

త్స్నాహుల్గుంపులుగూడికూడితమినం♦తంతన్నిరీక్షింపఁగాన్. 9

సీ. కలికితురాగుల్కు ♦ వెలిపట్టుపూపాగ
తలమీఁదజాబిల్లి ♦ తళుకులీనఁ
బ్రవిమలకాంతుల ♦ రవలంటుపోగులు
చెవులకునొకవింత ♦ చెలువునింప
మేల్తారహారముల్ ♦ మెడకుసొంపుఘటింప
ముంజేతికిఁగడెమ్ము ♦ మురువుఁబెంప
బిరుదైనమూరురా ♦ యరగండపెండార
మెడమకాలినలంక ♦ రించుచుండఁ
దెల్లదుస్తులుతొడిగిసం ♦ ఫుల్లవదన
పద్ముఁడైవచ్చికూర్చుండె ♦ భద్రపీఠి
ఖేటుమఖమల్కలాబతు ♦ దిండునాని
మనుజనాథుండుమన్మథ ♦ మన్మథుండు. 10

వ. ఇట్లు కూర్చుండియుండి. 11

శా. తారామండలినాసుధాంశుకరణిన్ ♦దద్విద్వదాస్థానముల్
శ్రీరంజిల్లఁగఁజేయుచుండిధిషణా ♦ సింధుండురత్నప్రభా
గారంబై విలసిల్లుపెండెరము బం♦గారంపుపల్లంబునం
దారాజోత్తముఁడుంచిసత్కవులకా ♦హ్లాదంబుసంధిల్లగాఁ

ఉ. ఈకవిగండపెండెర మ♦హీనవచోలహరీవిలాసముల్
ప్రాకటసంస్కృతాంధ్రములఁ ♦ బద్యనిగూఢినిజూపినట్టిసు
శ్లోకునిపాదపద్మమున ♦ లోకవిలోకనమాలికాళితో
నేకరుచింజెలంగఁగల♦ దెందునుగుందునుబొందకుండఁగాన్. 13



చ. అనినఁగవిత్వరాజ్యరమ ♦ యట్టివరించినయల్లసాని పె
ద్దనధరణీంద్రచంద్రునిసు ♦ ధామధురోక్తిఁ బ్రసన్నచిత్తుఁడై
తనయనవద్య హృద్యకవి♦తాసురవాహిని లోముదంబునన్
మనుజవరేణ్య మానసము♦మజ్జనమాడఁగఁ జెప్పెనీక్రియన్

ఉత్పల మాలిక.

పూఁతమెఱుంగులున్ బసరు ♦ పూపబెడంగులుఁజూపునట్టివా
కైతలు జగ్గునిగ్గు నెనగావలెఁ ♦ గమ్మనఁగమ్మనన్వలెన్
రాతిరియున్బగల్మఱపు ♦ రానిహొయల్ చెలియారజంపుని
ద్దాతరితీపులంబలెను ♦ దారసిలన్వలెలోఁదలంచినన్
బాతిగఁ బైకొనన్వలెను♦బైదలికుత్తుకలోనిపల్లటీ
కూఁతల నన్వలెన్ సొగసు♦కోర్కులు రావలెనాలకించినన్
జేతికొలందిఁ గౌఁగిటను♦జేర్చినఁ గన్నియచిన్ని పొన్నిమే
ల్పూఁతలచన్ను దోయివలె♦ముచ్చట గావలెఁ బట్టిచూచినన్
డాతొడనున్నమిన్నులమి ♦ టారపు ముద్దుల గుమ్మకమ్మనౌ
వాతెఱ దొండపండువలె♦వాచవిగావలెఁ బంటనూఁదినన్
గాతలఁ దమ్మిచూలిదొర ♦ కైవసపుంజవరాలి సిబ్బెపు
న్మైతెలియుబ్బురంపుజిగి♦ నిబ్బర పుబ్బగు గబ్బిగుబ్బపొం
బూఁతలనున్న కాయసరి♦పోఁడిమికిన్నెర మెట్లబంతి సం
గాతపు సన్నబంతిబయ♦కారపుఁగన్నడగౌళ వంతుకా
సాతతతానతానలప♦సందివుటాడెడు గోటమీటుబల్
మ్రోఁతలు నుంబలెన్ హొరువు♦మొల్లముగావలెనచ్చతెన్గులీ
రీతిగసంస్కృతంబుపచ ♦ రించినపట్టునభారతీవధూ

ణీతపనీయ గర్భనిక ♦ టీభవదానపర్వసాహితీ
భౌతికనాటకప్రకర ♦ భారతభారతసమ్మతప్రభా
శీతనగాత్మజాగిరిశ ♦ శేఖరశీతమయూఖరేఖికా
పాతసుధాప్రపూరబహు ♦ భంగఘుమంఘుమఘుంఘుమార్భటీ
జాతక  ళయుగ్మలయ ♦ సంగతిచూచు విపంచికామృదం
గాతత తేహితె త్తహిత ♦ హాధితధంధణుధాణుధింధిమి
వ్రాతనయానుకూలపద ♦ వారకహూద్వహహారికింకిణీ
నూతనఘల్లు లాచరణ ♦ నూపురఝుళఝుళీమరందసం
ఘాతవియద్ధునీచకచ ♦ కద్వికచోత్పలసారసంగ్రహా
యాతకుమారగంధవహ ♦ హారిసుగంధవిలాసయుక్తమై
చేతముచల్లఁజేయవలెఁ ♦ జిల్లునఁజల్లవలెన్మనోహర
ద్యోతకగోస్తనీఫలమ ♦ ధుద్రవగోఘృతపాయసప్రసా
రాతిరసప్రసారరుచి ♦ రప్రతిమంబుగసారెసారెకున్. 15

శా. ధాటిన్ సాటియెనా ననర్గళమహా ♦ ధారాప్రవాహంబుగాఁ
జాటున్ దద్విధిఁజెప్పినట్టికవితా ♦ సామ్రాజ్యధౌరేయుఁగ
ర్ణాటాధీశుఁడుచేరఁజీరిసరసన్ ♦ స్వర్ణాసనాసీనుగాఁ
బాటించెన్ బహుసత్కృతుల్సలిపెసం ♦ భావించెనామీఁదటన్

ఉ. ఆకవిగండపెండెరము ♦ నాతనికాలికిఁగూర్చిసత్కవీం
ద్రాకవిలోకమందు నీక ♦ నాంధ్రకవిత్వపితామహాంకముం
జేకురెనీకునంచనినఁ ♦ జేతులుదట్టిరి సభ్యులెక్కడే
నీకపికల్పకంబునకు ♦ నీడుగలారెయటంచు నుబ్బుచున్. 17

గీ. ఇట్లుపలుమాఱుగవులను ♦ గృష్ణవిభుఁడు



సత్కరించుటఁగనివిని ♦ సభ్యులెల్ల
నాంధ్రభోజుండితండని ♦ యభినుతించు
చుండిరెల్లెడనంతట ♦ నొక్కనాఁడు. 18

క. తనకోరిక నెరవేర్పన్
మనుచరిత్రప్రబంధఫణితి ♦ మధురతమముగాఁ
దెనుఁగునరచియించినపె
ద్దనకున్ సత్కృతియొసర్పఁ ♦ దలఁచిమనమునన్. 19

చ. దినకరతేజముం దెగడు ♦ దివ్యతరంబగుపైడిపల్లకిన్
జనపతి యూకవీంద్రునిడి ♦ సద్విభవంబున రాజధానిలోఁ
గొనిచనువేళ నావిభుఁడు ♦ గోర్కిమెయిన్ దనకేలనెత్తెనా
ఘనతరయానమున్ బుధులు ♦ గాంచిమనంబులఁజోద్యమందఁ
[గన్. 20

వ. తదనంతరంబ. 21

ఉ. కన్నడభారతంబునకుఁ ♦ గన్నడరాజ్యరమేశుఁడెంతయున్
వన్నియదెచ్చువాఁడనుచు ♦ భర్తగఁజేసినతిమ్మనార్యునిన్
బొన్నకడెమ్ములన్ రవల ♦ పోగులభూములఁబాడియావులన్
సన్నపుపట్టుపుట్టముల ♦ శాల్వలఁజేసెఁబ్రసన్నచిత్తుఁగాన్. 22

వ. అంత. 23

గీ. శైవుఁడయ్యునుశ్రీకృష్ణు ♦ జయముచాటు
పారిజాతాపహరణప్ర ♦ బంధమాంధ్ర
మందుసుందరఫణితిని ♦ నందికొలపు
తిమ్మనార్యుఁడుతనకంకి ♦ తమ్ముసేయ. 24

ఉ. అమ్మను జేశ్వరుండతని ♦ యద్భుతమైనకవిత్వధాటికిన్
గమ్మనిముద్దుపల్కుల సు♦ కమ్మునకున్ లలితంపుశయ్యకున్
నెమ్మదిఁబొంగికంఠమున ♦ నింపిసముజ్జ్వలతారహారముల్
క్రొమ్మనిసారెకుంగొసరి ♦ కొంకకయిచ్చెనుగోర్కెలన్నియున్
ఉ. ఇక్కరణింగవీంద్రుల మ♦హీంద్రుఁడు సారెకుగౌరవించుచున్
దక్కనసత్కళానిధులఁ ♦ దద్దయుప్రేమబహూకరించుచున్
జొక్కపుశౌర్యసంపదల ♦ శోభిలువీరులసత్కరించుచున్
మక్కువతోడధార్మికుల♦మన్ననసేయుచురాజ్యమేలుచోన్.
సీ. పాలేరుపరిఖయై ♦ భాసిల్లునట్లుగాఁ
గాటూరదృఢమైన ♦ కోటగట్టి
యీనున్నకప్పమ్ము ♦ లెగవేసిలక్షకా
ల్బలములమూడువేల్ ♦ హరులఁగూర్చి
ప్రబలమౌదాయగాఁ ♦ బరిణమిల్లగనుండు
నాయకుగర్వంబు ♦ నాశపఱుప
నెంచియువానికి ♦ హితముపదేశింప
దూతనంపినవాఁడు ♦ దూలనాడి
పనుపనిఁకసామమార్గంబు ♦ పాటిగాదు
పామునకుఁబాలువ్రోసిన ♦ పగిదియగుట
సత్యమంచనితలపోసి ♦ శౌర్యజలధి
కృష్ణుఁడెబ్బంగిశత్రు ని♦ర్జింపఁబూని. 27
చ. వెడలెమహాట్టహాసమున ♦ వేలకొలందిబలంబుగొల్వఁగా
దడదడఁబొఱుగుఱ్ఱముల♦ధాటికిభూమివడంకుచుండఁగాఁ



గడువడిదుమ్ముపైకెగసి ♦ కమ్మినభంబునఁగ్రాలుచుండఁగాఁ
గడలకుముట్టిభాంకృతులు♦గర్ణకఠోరములౌచునుండగాన్. 28
వ. ఇట్లు వెడలిపోయిపోయి. 29
మ. అకలంకోజ్జ్వలుఁడావిభుండుగనెన♦య్యభ్రంకషోత్తుంగముం
సకలారాతిభయంకరమ్మునుమహా♦శ్మవ్రాతసంబద్ధముం
బ్రకటానర్గళవిక్రమక్రమకళా ♦ ప్రావీణ్యసంరక్ష్యమున్
మకరాభీలగభీరవారిపరిఖా♦మాన్యంబునాదుర్గమున్. 30
క. కనిచుట్టుఁబొఱునీరున్
ఘనమగుకాలువలఁబొఱఁ♦గాఁజేసివడిన్
మునుముందు నిలిచికోటన్
గొననాజ్ఞయొసంగెరాజ ♦ కుంజరుఁడంతన్. 31
క. నాలుగు దిక్కులవీరుల్
కాలాంతకులగుచుఁగడఁగి ♦ కడఁకదలిర్పన్
వేలకొలందిగముట్టిరి
మూలచ్ఛేదంబుసేయ ♦ మూఁగినభంగిన్. 32
ఉ. అప్పుడుమీఁదినుండిశిల ♦ లగ్నిశరంబులుకాగుతైలముల్
చప్పునవానగాఁగురిసి ♦ సంభ్రమమొప్పఁగ నార్చిరారిపుల్
చెప్పనదేమికృష్ణుఁడుప్ర♦సిద్ధశరంబులఫెళ్ ఫెళార్భటిన్
దెప్పరమైనవేగమున ♦ దీటుగఁగొల్పెనుగోటమీఁదికిన్ 33
ఉ. దానికిఁదాళలేకడలి ♦ దాఁటిరిశత్రులుభూవిభుండులో
నూనినకిన్కనగ్గడల ♦ నొక్కటలోనికిదారిదీసికా
లానిలసన్నిభుండగుచు ♦ నార్చిబలంబులఁగూర్చివైరిసే,

నానికరంబుగూల్చినర♦నాథుఁడుకోటను గెల్చెనుద్ధతిన్. 34

సీ. అంతనంతిపురంబు♦నందుడాఁగినయట్టి
యరిఁజెఱఁగొనికోట♦నాప్తునునిచి
పదియాఱు లక్షల♦బంగారునాణెముల్
మగరాలు సెక్కిన♦మండనములు
తారహారమ్ములు♦ధవళాత పత్రముల్
చంద్రహాసమ్ములు♦చామరములు
పైడియందలములు♦భద్రపీఠమ్ములు
సైంధవమ్ములు గంధ♦సింధురములు
గొల్లగాఁగొని శ్రీకృష్ణ♦వల్లభుండు
విజయదుందుభి నాదంబు ♦ వేడ్కనింప
విజయనగరంబునకు వచ్చి♦ప్రజలనెల్ల
దివ్యనవ్య సుఖమ్ములఁ♦దేల్చుచుండె. 35

వ. అంత. 36

సీ. గండుతుమ్మెద గుంపు♦కబరీభరంబుగాఁ
జిగురుటాకులు పట్టు♦చీరెగాఁగ
విచ్చుమల్లెల కాంతి♦విమలస్మితముగాఁగఁ
గమ్మతెమ్మెర యూర్పు♦గాలిగాఁగ
వెన్నెలయును నెండ ♦ వెలిముసుంగులు గాఁగ
వరపిక నాదంబు♦పాటగాఁగ
జగదీశు సత్కటా ♦ క్షము తన చెలువుగా
సరసీతటాకముల్♦సఖులుగాఁగఁ



జంద్రసూర్యులు బిరుదు సూ ♦ చనలుగాఁగ
సకలజన వీక్షణంబులు♦చల్లఁగాఁగ
నందమెత్తినరూపపంపు♦చందమనఁగ
సంతసము హెచ్చవచ్చెవ ♦ సంతలక్ష్మి. 37

ఉ. అత్తఱిఁదీర్ఘయాత్రకయి♦యన్నృపమౌళిసతీసమేతుఁడై
చిత్తమెలర్ప గానరిగి♦సింధునదీసరసీతటాకముల్
తత్తదుపాంతసీమలుని♦తాంతసమంచిత భక్తిఁగాంచి స
ర్వోత్తముఁడైన యీశ్వరుమ♦హోత్తమసృష్టికిఁ జోద్యమం
దుచున్. 38

శా. ఆతీర్థంబులనుండు దృశ్యములకున్♦హర్షంబులోఁ దేలుచున్
బ్రాతఃకాలమహాప్రభావములకున్♦భావంబులో మెచ్చుచున్
జేతంబీశ్వరుఁ జేర్చిసిద్ధునిగతిన్♦జింతించుచున్ బాడుచున్
బ్రీతింగొండలఁ జేరి మేనపులకల్♦పెల్లెత్తఁ బ్రార్థించుచున్. 39

వ. ఇట్లు తీర్థంబుల సేవించుచుఁబోయిపోయి. 40

సీ. కంచిగోపురమును ♦ గాంచిసంతసమంది
తిరుపతికొండను ♦ దీర్థమాడి
వేలాపురీశిల్ప ♦ విభవంబులీక్షించి
కాళహస్తిని శైవ♦ కళలకలరి
కొండలపైనుండి ♦ గుట్టలకునుజారి
యటనుండియడవుల ♦ యందుదూరి
పాఱుకావేరీప్ర♦వాహంబునకుమెచ్చి
దానితీరంబునఁ ♦ దరలితరలి

సకలదానంబులచ్చట ♦ చ్చటను జేసి
యతులసంతోషభరమున ♦ నలరియలరి
వచ్చిచేరెనుశ్రీరంగ ♦ పట్టణంబు
వీరశ్రీకృష్ణరాయఁడు ♦ విజయసముఁడు. 41

వ. అంత నచ్చట. 42

సీ. పరతంత్రభేదన ♦ పారీణగురుఁడను
పేరుచేమించు బ♦ర్యాకారువాఁడు
విమతకాననపంక్తి ♦ వీతిహోత్రుండని
రాజిల్లుబంకాపు ♦ రమ్మువాఁడు
రిపుశిక్షణోద్యోగ ♦ రీతిఁబార్థుండని
పాటింపఁబడుకళ్లి ♦ కోటవాఁడు
సమరంబుననెదుర్చు ♦ శత్రువీరులకెల్ల
కాలాంతకుండు భ♦ట్కల్లువాఁడు
మొదలుగాఁగలసామంత ♦ భూమిధవులు
వచ్చికానుకలిచ్చిత ♦ న్మెచ్చికొలువ
భోగదేవేంద్రుకైవడిఁ ♦ బొల్చుచుండి
యప్పగీశ్వరుమాన సం♦బలరునట్లు. 43

చ. అతనిసుపుత్రినందమున ♦ కందమునింపెడుసద్గుణాన్వితన్
వితతవిలాససంపదల ♦ విశ్వమువిస్మయమందునట్లుగా
హితమతిఁబెండ్లియాడి పృథి ♦ వీంద్రుఁడు కాంతలఁగూడికం
[తుఁడై
యతులమహావిభూతిఁజనె♦నాత్మపురంబునకున్ బ్రియంబునన్.



ఉ. ఇవ్విధిఁదీర్థయాత్రను మ♦హీంద్రుఁడుదీరిచివచ్చిప్రేమతో
నెవ్వగయుంబ్రజంబొరయ ♦ నీకసునీతినిరాజ్యమేలుచున్
దవ్వులదవ్వులందనక♦శల్ సుజనుల్ వినిమెచ్చఁబొల్చెఁదా
గవ్వడికైవడిన్ మఱియుఁ♦గర్ణునికైవడిఁబెట్టుపోతలన్. 45

వ. ఇట్లుండి యొక్కనాఁడారాజదేవేంద్రుండు బంధుమిత్ర సచివ సామంత విద్వద్బృందంబులు గొలువ మహానందంబునఁ బేరోలగంబుఁదీర్చి. 46

గీ. కొండపల్లిని దాఁజెఱ ♦ గొన్నయట్టి
గజపతి కుమారరత్నంబు♦గత్తిసాము
లోన నసమానుఁడనివిని♦మానసమున
నతనిపాండిత్యమును జూడ♦నభిలషించి. 47

చ. పిలువఁగనంప నోఢ్రపతి♦వీరకుమార వరుండు కొల్వులో
పలఁగలవారి కన్నులకుఁ బండు ♦ గుసేయుచువచ్చె వచ్చినన్
విలసద మూల్యరత్నమయ♦పీఠమునిచ్చివిభుండు సత్కృతుల్
సలిపియభీష్టముం దెలుప♦సంతసమందికుమారుఁడంతటన్. 48

చ. తళతళలాడుఖడ్గమును ♦ దాల్చికరంబునఁ జేరిరంగమున్
లలితతనూవిలాసమును ♦ లాఘవమున్ మరిసుప్రచారమున్
గలితకృపాణకౌశలము ♦ గన్గొనియద్భుతమందఁజూపరుల్
మెలఁగెనుగృష్ణభూవిభుఁడు ♦ మెచ్చితనుం గొనియాడు నట్లు
గాన్ 49

ఉ. రంగమునందునివ్విధిత ♦ రంగముపోలికమించుకైవడిన్
సింగముభంగిభాస్కరుని ♦ చెల్వునఁబూర్ణశశాంకువైఖరిన్

బొంగుచుఁ బొల్చురాజసుత ♦ పుంగవుఁ డొక్కఁడు సేరి యుద్దిగా
సంగరకౌశలంబు విర♦సంబుగఁ జూపఁదొడంగె దానికిన్. 50

ఉ. కోపవిషాదముల్మదిని ♦ గ్రోల్తల సేయుగ రాకొమారుఁడా
టోపము నాపఁజాలక క♦ఠోరతపక్షముఁ జేతికత్తితో
నేపునఁ జీల్చికొంచుఁ బడి♦ యెన్ దనుఁ జూచినవారలెల్ల సం
తాపములోఁ మునుంగ నర♦నాథుఁడు విహ్వలమంది కుందఁగాన్

క. మానము ప్రాణముకంటెన్
మానితముగ నెంచిమనెడు ♦ మాన్యులు ధరలో
మానము పోయెడు వేళన్
మానుదురే ప్రాణమిడక ♦ మానవనాథా. 52

వ. అంత. 53

క. తలవనితలఁపుగ నివ్విధిఁ
గలిగినవిధిఘటనమునకుఁ ♦ గడువగచి ధరా
లలనాపతి యవ్వార్తన్
దెలిపెన్ గజపతికి విధవి♦నిర్జితమతికిన్. 54

చ. తెలిపిననాగజేంద్రుఁడతి♦దీనుఁడు శోకపరీతచిత్తుఁడై
కలఁగినమానసంబునకుఁ ♦ గట్టిగ ధైర్యము వెట్టి కృష్ణమ
త్కులము హతంబు సేసితివి ♦ కోమలి కేనియు నోచనైతినా
తలఁపులు సేతలుం దలఁచి♦ తల్లడమందితి నింకఁ జాలదా. 55

క. అనివ్రాసిన గజపతిపైఁ
గనికరము పొంగి పలువఁ♦ గరుణానిధిభూ
వనితాపతి కృష్ణుఁడు దన



మనమును మతిమంతుఁడైన ♦ మంత్రికిఁ దెలిపెన్. 56

చ. అతఁడు కళింగనాథునకు ♦ నర్థముగా నిటు లెచ్చరించె మా
పతికి నిమీాకు బాంధవము ♦ బాగుగఁ గల్గిన నీసు రోసముల్
మతులఁ దొలంగి యుద్ధజస♦మానయశోవిభవంబు లంది భూ
హితముగ నేలఁ గల్గుదురి♦ దేలఁ దలంపరు మీారు భూవరా. 57

క. అనిమేల్కొల్పినఁ గరిపతి
తనకన్యారత్నమునకుఁ ♦ దగినవరునిగా
దినకరతేజుని గృష్ణుని
మనమునఁ దలపోసి తిమ్మ♦మంత్రికిఁ దెలిపెన్. 58

వ. అంత. 59

ఉ. పెండిలికిద్దఱుం గడఁగి♦ పేరిమిఁ గూరిమిమీఱ యత్నముల్
దండిగఁ జేయ నెక్కుడను♦ ధారుణి పండుగఁ గాంగఁ దోఁచె భూ
మండల మండనంబనఁగ ♦ మండితమై యలరారె కృష్ణభూ
మండలి రాజధానిమణి♦మండపమై వెలుఁగొందె వేడ్కలన్

ఉ. అంతట సన్ముహూర్తమున ♦ నానరపాలశశాంకశేఖరుం
డెంతయుఁ బ్రీతితోడఁ ♦ గటకేశ్వరుసూతినిఁ దుక్కమాసతిన్
గాంతగఁ గైకొనె న్వదన♦కాంతివినిర్జితచంద్రదీధితిన్
సంతతమందహాసవతిఁ ♦ జారుగుణద్యుతి నూత్నపార్వతిన్. 61

ఉ. అంతన నంతసౌఖ్యముల ♦ నాకటకేంద్రుని దేల్చఁ గోరి భూ
కాంతుఁడొసంగె నాతనిసు♦కాంతను గృష్ణునకు మీఁది ప్రాంతముల్
స్వాంతములోని కల్మషము ♦ శాంతము సేసెఁ గడిందిశత్రువున్
సంతత మైత్రికిన్ గొలిపె♦ సాటియె కృష్ణుని కూటనీతికిన్. 62

వ. ఇట్లు. 63

ఉ. శత్రునిమిత్రుగాసలిపి ♦ సత్పురుషుల్ దను మెచ్చునట్టిచా
రిత్రముగల్గిదుష్టులకు♦రీతులమాన్చుచుశిష్టపాళికిన్
మైత్రినిజూపుచున్ మెలఁగి♦మానవనాథమహేంద్రుఁడార్తులన్
బాత్రులఁ బ్రోచుచున్ సతుల♦బంధులగూడిచెలంగుచుండగాఁ

ఉ. ఆనరనాథ చంద్రునకు♦నాతనిదేవికిఁదిర్మలాంబకున్
బూనికవారలిద్దఱి ప్ర♦ఫుల్లగుణంబులు గూడియొక్కటై
మానినియయ్యెనా జనక ♦ మానసవార్ధి సుధాంశుమూర్తియై
దానుదయించి తిర్మలము♦దంబున వర్ధిలుచుండెనంతటన్. 65

గీ. శ్రీమహాలక్ష్మిఁ బోలెడు♦చిన్నమాంబ
గర్భరత్నాకరంబునఁ♦గలిగి వెంగ
ళాంబ శ్రీకృష్ణరాజచి ♦ త్తాబ్జమలర
నెదుగుచుండెను బాదలి బా ♦ లేందుపగిది. 66

వ. ఇట్లాపుత్రికారత్నంబులిరువురు దినదిన ప్రవర్ధమానలగు
చుండ. 67

ఉ. ఎత్తుచుముద్దుగొంచు ధర♦ణీంద్రుఁడువారల యాటపాటకున్
జిత్తమునందుఁబొంగుచువి ♦ చిత్రము మోహమటంచు నెంచు
[చున్
బొత్తునఁబెట్టికొంచుఁదగు ♦ బుద్ధులు నేర్పుచు మేలుకీడులన్
మెత్తనిపల్కులం దెలిపి ♦ మేలిమిఁదాలిమిఁజూపిప్రోచుచున్.

ఉ. శాంతదయారసంబులని ♦ శాంతము సేయగ మానసంబులన్
సంతతినాకృపానిధి యొ♦సంగునుధాత్రినటంచుబాగుగా



స్వాంతమునం దెఱింగి పరి♦పాలన సేయుచునుండె రాజ్యమున్
జింతలదీర్చునావిభుని ♦ చిత్తసరోజముఁ జేర్చిభూవరా 69

మ్మాలినీవృత్తము.

సురుచిరగుణజాలా ♦ సూరిసంభావ్యశీలా
సరసవచనలోలా ♦ సాంద్రసత్కీర్తిమాలా
పరిజనపరిపాలా ♦ భవ్యధర్మానుకూలా
పరమపురుషలీలా ♦ పాదవిన్యస్తఫాలా. 70

ఇది శ్రీబుచ్చివేంకయామాత్య తనయ సకలసజ్జనవిధేయ
ఆదిపూడి సోమనాథనామధేయ ప్రణీతంబైన
శ్రీ కృష్ణదేవరాయచరిత్రంబునందుఁ
బంచమాశ్వాసము
సంపూర్ణము.



శ్రీ

# కృష్ణదేవరాయ చరిత్రము.

## షష్ఠాశ్వాసము.


కరధాత్రీశమిత్రా
శోకనివారణవివేక ♦ శుద్ధచరిత్రా
శ్రీకృష్ణవిభుప్రపౌత్రా
ప్రాకటబుధలోకనిత్య ♦ భావనపాత్రా. 1

వ. అవధరింపుము. అట్లు కర్ణాట భూమండలాఖండలుండగు నక్కృష్ణసార్వభౌముండు. 2

చ. అమలకవీంద్రభోజుఁడయి ♦ యాశ్రితకోటికిఁ బారిజాతమై
సమరకలావిచక్షణత ♦ శక్రసుతుండయి తీవినింద్రుఁడై
సమదకరీంద్రగర్వశమ ♦ నంబున కెంతయుఁ జిత్రభానుఁడై
ప్రమదముమీఱఁగాఁ బ్రజలఁ ♦ బాలనసేయుచునుండి కూరిమిన్.

ఉ. సాళ్వనృసింహువాంఛితము ♦ సాంతముగా నెరవేర్చు కోర్కెలో
నిల్వక నూలుకొల్పవర ♦ నీతికరాతిబిజాపురీపతిన్
గెల్వఁగ నోపు సైన్యముల ♦ నేకము గూర్చి సంధిబంధమున్
సుళ్వఁగఁ ద్రెంచుమార్గమును ♦ జూచుచు వేచుచు నుండునంత
[లోన్. 4

చ. నలువదివేలబంగరపు ♦ నాణెములిచ్చి పఠానుగుజ్జముల్
విలువఁగ సైదుమర్కరను ♦ మ్లేచ్ఛు నిబంపిన వాఁడు ద్రోహియై



కలిసి బిజాపురీపతిని ♦ గాలము పుచ్చఁగఁ గృష్ణుఁడుగ్రుఁడై
తెలిపెను మ్లేచ్ఛనాథునకుఁ ♦ దేటగ దుర్మతి నంపివేయఁగన్ 5

ఉ. ఆమతపక్షపాతియవ ♦ న్యాధిపుఁ డాఖలు దాఁచిపెట్టియే
మేమొయనర్హవాక్యముల ♦ నెంతయు హేళనసేయ సాగినన్
దామసవర్తులన్ దనప్ర ♦ తాపకృశానుకరాళకీలలన్
వేమఱుభస్మమున్ సలుపు ♦ వీరుఁడు కృష్ణుఁడు గ్రోధమూర్తియై.

వ. అమ్మదోన్మత్తుండగు బిజాపురి యిస్మాయిల్ అదిల్ షాయొక్క కొఱగాములు స్పష్టంబులగునట్లు అహమద్ నగరాధీశ్వరుం డగు బుర్హాన్ నిజాంషాను గోల్కొండ నవాబగు కూలి కుతుబ్షాను విదర్భాధిపతియగు బరీదుషాను దెలియం జేసి తానీవిషయంబున నిర్దోషియగుట జగంబునకు వెల్లడి పఱిచి రాచూరిపై దండెత్తిపోన నిశ్చయించి. 7

చ. పిడుగులు వ్రాలెఁ బెల్లడరు ♦ భీమబలాఢ్యులు దండనాథులున్
బుడమిపడంకు ఘాటి మెయిఁ ♦ బోయి విపక్షులఁ గూల్చుభూధవుల్
విడువనిభక్తిఁ గొల్వమణి ♦ పీఠమునందు వసించి కొల్వులోఁ
బొడమిన వేడ్కతోఁ బలికెఁ ♦ బొంగుచు నందఱు నాలకింపఁగన్

సీ. యవనుల నెదిరించి ♦ యని గెల్వ రెవ్వరం
చను మాటకల్లగాఁ ♦ జనుదినంబు
కర్ణాటలక్ష్మికిఁ ♦ గాఁపు నల్గడలందుఁ
గలిగెనంచని చెప్పఁ ♦ గలదినంబు
బిరుదై నమూరురా ♦ యరగండ పెండెర

మ్మిదిమాకుదృఢమని ♦ యెడుదినంబు
నిజముగామనపురి ♦ విజయపురంబయి
సార్థకంబగునట్టి ♦ సద్దినంబు
గోరఁగావచ్చె నేఁటికి ♦ వీరులార
చండతరవిక్రమోగ్రమా ♦ ర్తాండులార
యేచియవనుల గర్వంబు ♦ లింకఁజేసి
భూరిజయలక్ష్మిఁగై కొండు ♦ పూజ్యులార. 9

గీ. ఆబిజాపురివాఁడుమ ♦ హాఖలుండు
హరులఁదేఁబోయిమనధన ♦ మపహరించి
వానిఁగలిసిననీచునిఁ ♦ బంపఁగోరఁ
బనుపకేమేమొ తుచ్ఛంపు ♦ పలుకులాడె. 10

వ. మఱియునద్ధూర్తుండు. 11

ఉ. ద్రోహిరసూలువంశజని ♦ తుండగుటన్ సచివాగ్రులందఱున్
స్నేహముమీఱ వానిఁదన ♦ నెయ్యునిగాఁదలఁపంగ వేడినన్
దాహితమంచు నెంచివడి ♦ (దాబులుపట్టణ) మంపెవాని నా
సాహసమేమిచెప్పుదు బి ♦ జాపురినాశముసేసి చెప్పెదన్. 12

సీ. గంగరాజొడెయల ♦ గండడంచిన నాఁటి
ఘనతరవిక్రమ ♦ క్రమముగాదు
మదగజేంద్రునిముట్టి ♦ మాడ్చివేసినయట్టి
భూరిప్రతాపవి ♦ స్ఫూర్తిగాదు
కాటూరివానిని ♦ గలఁచివేఁటాడిన
కడుభయంకరమైన ♦ కడఁకగాదు



మూడునొక్కటిగాఁగ ♦ ముప్పిరిగాఁగూర్చి
విజయుశౌర్యంబున ♦ వెలయుచున్న
నేఁడుజయలక్ష్మిమనలను ♦ గూడఁబోదు
దేవుఁడొసఁగినమనదివ్య ♦ తేజమెల్ల
సఫలమగునట్లుసమరాన ♦ శత్రుతతులఁ
జీల్చిచెండాడిసత్కీర్తిఁ ♦ జెందిమునుఁడు. 13

వ. మఱియు. 14

సీ. కర్ణాటలక్ష్మినిఁ ♦ గాచిఖ్యాతినిఁగాంచఁ
గనకాభిషేకంబు ♦ గాదెమనకు
సాళ్వనృసింహేంద్రు ♦ సద్వాంఛితంబున
గడతేర్పఁబండుగ ♦ గాదెమనకు
దేశరక్షణలోన ♦ దేహమర్పించిన
ఘనవీరస్వర్గంబు ♦ గాదెమనకు
శత్రునిశ్శేషంబు ♦ సల్పినిద్రించుట
కమనీయయోగంబు ♦ గాదెమనకుఁ
గాననాచంద్రరవితార ♦ కంబుజగతి
మీచరిత్రంబునందఱు ♦ మెచ్చికొనఁగఁ
దేజముచుజూపిమనమాతృ ♦ దేశమలరఁ
గీర్తిఁబొందుఁడుశౌర్య స ♦ న్మూర్తులార. 15

చ. అనవినివారు నేత్రముల ♦ హర్ష జలంబులు రాలగద్గద
స్వనములఁ గేలుమోడ్చినర ♦ పాలక చంద్రత్వదీయవాంఛితం
బును నెరవేర్చు టేపనిగఁ ♦ బూసినవారము వేఱెఱుంగ మా

జనవరనీదునాజ్ఞ శిరసావహియించెదమంచుఁ దెల్పినన్. 16

చ. జనపతివారిభక్తికెదఁ జాలఁగ మెచ్చి నవాంబుజంబులన్
గనుఁగొనినవ్వు నేత్రముల గాఢదయామయవీక్షణంబులన్
దనిపి యథార్హసత్కృతుల నవ్యసుఖంబొడఁ గూర్చి వేరువన్
మొనలను గూడి రాఁ దెలిపి మ్రోగఁగఁ జేసె రణప్రయాణమున్

వ. అట్లు దండయాత్ర సాటించిన. 18

ఉ. ఎక్కడఁ జూచినం గరులె యెక్కడఁ జూచిన నశ్వరాజియే
యెక్కడఁ జూడఁ గాల్బలము లెక్కడఁ జూచిన దండనాథులే
యెక్కడఁ జూచినం గలని కేగెడువారల సంభ్రమంబులే
దక్కమతేమిగాననివి ధంబయి యుప్పరియొప్పె వేడుకన్. 19

గీ. అప్పుడొక దండనాథుని నన్నృపాలుఁ
డని చె నేఁబది వేల సైన్యంబుతోడ
ధాటికెట్టి ప్రమాదంబు దగలకుండఁ
జూచుచును ముందుఁ బోవరా చూరుజాడ. 20

వ. మఱియును. 21

క. ఆదంతునకిరుపంకలఁ
గోదండధరుల్ సహస్ర ఘోటకసేనల్
ప్రోదిగఁ బోఁబురికొల్పెను
సాదరమునఁ జూచుఁగాన సకలబలములన్. 22

ఉ. అంతనృపాలమౌళి తనయంతిపురంబున కేగి దేవ్రునే
కాంతమునందుఁ గొల్చుచు సుఖంబుగ రాతిరి నిద్రసేసి స
త్కాంతలగీతవాద్యములు గర్ణముసోఁకినతోనె వేకువన్





శాంతమనంబులోఁ బరమశాంతుని నెంచుచు మేలుకాంచినన్.

మాలిని.

త్రిభువనవిభునాజ్ఞన్ బీతిబ్రహ్మాండమెల్లన్
బ్రభలవెలుఁగఁ జేయన్ భవ్యరూపంబుతోడన్
నభమున సతతంబున్ గ్రాలు భాస్వంతుఁడంతన్
శుభకరుఁడుగఁ దోఁచెన్ శుభ్రమై పొల్చుప్రాచిన్ 24

వ. తత్సమయంబున. 25

ఉ. తీరిచి కాల్యకృత్యములు దివ్యమణిప్రభలొప్పు భూషలన్
జేరిచి వస్తులం దొడిగి చేతను దాల్చి ప్రశస్తఖడ్గమున్
ధీరుఁడు గొల్వుసొచ్చి రవిదీప్తులమించెడు రత్నపీఠమున్
జేరి ప్రకాశమానుఁడయి జిష్ణునిమీఱెను వైభవంబునన్. 26

వ. ఇట్లు సూర్యోదయావసరంబునఁ గట్టాయితంబై వచ్చి సమ
స్తసామంతసేనాధిపవర్గంబు దన్నునిసర్గంబై నభక్తితోఁ గొ
లుచుచుండ నారాజన్యశిరోమణి పేరోలగంబుండి సంగరభే
రి వేయించిన. 27

ఉ. ఆరణభేరిభాంకృతికి హర్షమునొంది సమస్తసేనలున్
దీరిచినిల్చి పెంపెసఁగ దిక్కులుపిక్కటిలంగి హేషఘీం
కారములొప్పె శత్రుల ఫికావికసేసెడు వేడ్క మీఱఁగా
వీరభటాళిహుంకృతులు వీనులవిందొనరించె నంతటన్. 28

ఉ. ధారుణినాథచంద్రుఁడు మదంబునఁ బొంగుచు దండనాథులన్
వీరవతంసరత్నముల వేఁబురికొల్పినవారు వారుధా
టీరభసంబులన్ సురల బీవినిఁ బోవఁదొడంగి రొక్కటన్

ధారుణ భేరికాపటహ ♦ ధాంధణముల్మదికింపుఁబెంపగన్. 29

ఉ. అప్పుడుకామనాయకుఁడ♦హార్పతితేజుఁడు ముందుధాటితో
ముప్పదివేలకాల్బలము♦మోదమునింపెడు వేయిగుఱ్ఱముల్
ముప్పదిరెంటిలోసగము ♦ పొల్పుమదేభములుల్లసిల్లఁగా
దెప్పరమైనసేనగొని♦ధీరులు మెచ్చఁగఁదర్లెనుగ్రుఁడై. 30

ఉ. దానిని వెంటనంటిచనె♦త్ర్యంబకరాయఁడు త్ర్యంబకాభుఁడై
యేనుఁగు లిర్వదాపయిని♦నేఁబదివేల పదాతివర్గమున్
మేనులకాంతులొల్కవడి♦ మించులమించెడు రెండువేల్హారుల్
దోనడువన్ మహార్భటిని♦దోఁగుచువీర రసాబ్ధినంతటన్. 31

క. అరువదివేల్కాల్బలములు
మురువుగమదియించినట్టి ♦ ముప్పదిగజముల్
దురగములుముప్పదేనూ
ర్లరుదేరన్దిమ్మనాయ ♦ కాగ్రణివెడలెన్. 32

వ. అతని వెంబడించి. 33

క. పంచసహస్రాశ్వంబులు
పంచాశత్కరులుమఱియుఁ ♦ బదిపదివేలున్
మించినకాల్బలములురా
నంచితుఁడాదెప్పనాయ ♦ కార్యుఁడునడిచెన్. 34

సీ. అంతఁగొండారెడ్డి ♦ యఱువదేనుంగులు
నార్వేలగుఱ్ఱము ♦ లతిజవములు
లయకృతాంతులఁబోలు ♦ లక్షయునిర్వది
వేలకాలరులును ♦ గ్రాలుచుండ



వేడ్కతో మఱియును ♦ విక్రమక్రమమున
విక్రమార్కుండని ♦ పేరుగన్న
తనయుండు నలువది ♦ దంతీంద్రములు రెండు
వేల్హారులెనిమిది ♦ వేల్పదాతి
వర్గములు గూడిరాఁగన ♦ నర్గళముగఁ
గదలెనభిమన్యుతోఁగూడి ♦ కదలినట్టి
పార్థుపోలిక నందఱుఁ ♦ బ్రస్తుతింప
ధరణివడవడవణఁకెడు ♦ ధాటితోడ. 35

వ. తదనంతరంబ. 36

గీ. వేయిగుఱ్ఱాలు ముప్పది ♦ వేలకాలఁది
కాల్బలంబులు మఱిపది ♦ కరులుగొలువ
సాత్యకిని బోలునట్టియా ♦ శౌర్యజలధి
వెడలెఁగడు వేడ్కసాళ్వ గో♦విందరాజు. 37

వ. అతనివెన్నంటి. 38

క. పదునేను మదగజంబులు
పదినాల్గులవేల్పదాతి ♦ బలములునాపై
పదినూర్లహరులఁ జేకొని
పొదలుచుసాగిరి బిరాన ♦ ముప్వురుఖోజాల్ 39

వ. వారివెనువెంటనంటి. 40

గీ. చెలగుపదునేనువేలకా ♦ ల్బలముతోడ
రెండువందల గుఱ్ఱాల♦దండుతోడఁ
బిడుగువలెవైరులనుదాఁకు ♦ కడఁకతోడ

వేఁగమధురాధినాయకుం♦డెలమితోడ. 41

ఉ. అంతటనందఱుం దను న♦హాయని మెచ్చఁగఁ బోయె వైరిభూ
కాంతులకుం గృతాంతుఁడయి♦క్రాలెడు రంగపురీశుఁ డార్భటిన్
దంతులునాలుగైదులు ప♦దాతిచయంబులు నాల్గు రెండ్ల వేల్
పంతముమీఱఁ బర్వ్వలిడు♦వాజులు నాలుగునూర్లు వెంటరాన్.

ఉ. అంతననేకయుద్ధముల♦నారిన తేరిన ఘోరవీరసా
మంతులు నీతివంతులు సు♦మంతసమప్రతిభావిశాలధీ
మంతులు కీర్తివంతుల స♦మానపరాక్రమవంతు లద్ధరా
కాంతుని యాజ్ఞ చేసమర♦కాంక్షను దర్లిరపారసేనతోన్. 43

వ. ఇట్లు జగత్ప్రభునాజ్ఞ నొకటివెనుక మఱియొకటిగ నవనవ విలాసంబులం జను ఋతుపరంపరలవలె నక్కృష్ణప్రభునానతి వేఱువేఱు సమరకలాపంబుల నమరి మొనవెంట మొనగ నెడ తెగక వాహినీనిచయంబులు పఱచిన యనంతరంబ. 44

ఉ. రత్నమయప్రభావిభవ ♦ రంజితమైయలగారుపీఠమున్
నూత్నజయేందిరంగొనున ♦ నూనవిలాసము తోడఁ గృష్ణరా
డ్రత్నముడిగ్గిభృత్యులుప ♦ రాకులు దెల్పఁగవచ్చి మోసలన్
బత్నులుపంపినట్టి సుమ♦వార్త్తికముల్ధరియించియాపయిన్. 45

సీ. హారంబట్టుగవ్రేసెన ♦ హారయలుమీఱఁగ దాల్చి
మణిమండనంబుల ♦ మహిమఁదనరి
రోహిణాచలమున ♦ రోచులు వెదఁజల్లు
గంధసింధురముపైఁ ♦ గ్రాలుచుండు
కాంచననవరత్న ♦ ఖచితమైయొప్పారు



నంబారిపై సూర్యుఁ ♦ డనఁగనొప్పి
కూర్చుండెఁ గుసుమముల్ ♦ గురిసె నల్గడనుండి
దుందుభిధ్వానంబు ♦ విందుగొలిపె
నుతులుదీవెనపలుకుల ♦ గతులుసెలఁగె
జయజయధ్వనియంబర ♦ స్థలముముట్టె
విజయలక్ష్మినిఁ బెండ్లాడ ♦ విభుఁడు వెడలు
వైభవముదోఁచెరవిమింట ♦ వాలిచూచె. 46

వ. అంత. 47

సీ. ప్రళయాగ్నివలెమండి ♦ పరిపంథిబలములఁ
గాల్చునల్వదివేల ♦ కాల్బలములు
సమరాగ్రతలమున ♦ సమవర్తిమూర్తులై
యడరెడునాశ్వికు ♦ లాఱువేలు
తమమీఁదవిలుకాండ్రు ♦ దంతాలఁగత్తులు
త్రొండాలరోకళ్లు ♦ దోడుసూప
భండనమ్మునవైరి ♦ తండమ్ములనుజించి
చెండాడుమున్నూఱు♦ సింధురములు
ఫెళ్ ఫెళార్భటిశత్రుల♦ వీచమడఁచు
రౌద్రమొప్పారుజంగు ఫి♦రంగిగములు
భక్తిసన్నద్ధమైవచ్చి ♦ బలసికొలువ
వెడలెనభినవకృష్ణుండు ♦ వేడ్కమీఱ. 48

వ. ఇట్లు వెడలి పోవుచుండ. 49

సీ. నిగనిగమెఱసెడు ♦ నిస్త్రింశనిచయముల్

శల్పపాలతాళ్వులై ♦ సొంపుమీఱ
విలుకాండ్రచేతిలో ♦ వెలయుకోదండమ్ము
లింద్రచాపంబులై ♦ యింపునింప
జంగుఫిరంగుల ♦ శకటచక్రంబుల
రావంబులుఱుములై ♦ రహిఁవహింప
నల్లనికాంతులఁ ♦ జల్లుమత్తేభముల్
మేఘజాలమ్ములై ♦ మెలఁగుచుండ
శత్రుదవదహనంబులఁ ♦ జల్లఁజేయ
సోనగాఁగఱకుటమ్ముల ♦ వానగురియఁ
బోవుపర్జన్యునింబోలెఁ ♦ బొల్చుచుండె
నన్నృపాలవరేణ్యుని ♦ యలఘుధాటి. 50

ఉ. ఇవ్విధినేడు లక్షలకు ♦ నెచ్చినసేనలతోడఁ గూడియా
కవ్వడికైవడిన్ వెడలి ♦ కర్ణకఠోరధణంధణార్భటిన్
దవ్వులఁ బోయిపోయితన ♦ ధాటికి శత్రులు దల్లడిల్లఁగా
మవ్వనుమీఱదండులను♦ మల్లయబండనుదింపెదింపినన్. 51

సీ. దండనాథులు దమతమ ♦ దళముఁగూడి
వేఱువేఱుగ విడిసిరి ♦ వారికపుడు
వీటవలెఁ గోరికలు నెర♦వేరుచుండె
నాక్షితీంద్రునికరుణాక♦టాక్షమహిమ. 52

ఉ. ఆటలుపాటలున్నతియు ♦ నచ్చటముచ్చటవారికచ్చటే
ఘోటకసామజంబులకుఁ♦గూడును నీరునుగూడనచ్చటే
కోటులకొద్దిగాధనము ♦ గోరిననిచ్చెడు బచ్చులచ్చటే



సాటియెకృష్ణభూవిభుని ♦ సంగ్రహశక్తికిఁబృథ్వినెచ్చటన్ 53

వ. ఇట్లు రాచూరిసమీపమందలి మల్లియబండను శ్రీకృష్ణరా
జేంద్రుండు సేనలువిడిసి కోటపైఁబోవ యత్నించుచుండ. 54

సీ. అది వినిరాచూరు ♦ నందలిసేనాని
ప్రాకారములుమూడు ♦ భద్రపఱిచి
నలుగడ రెండువం ♦ దలఫిరంగులనెత్తి
యొడిసెలువ్వెడియంత్ర ♦ మొకటియునిచి
గచ్చుచేవాకిలి ♦ గట్టిగామూయించి
శస్త్రంబులకునెల్ల ♦ సానవెట్టి
గుండునుమందును ♦ గొల్లగాఁగూరిచి
యయిదేండ్లసామగ్రి ♦ ననువుపఱిచి
వీరులెనిమిదివేలునా ♦ భీలగజము
లిరువదియునాల్గువందల ♦ హరులుగొలువ
శౌర్యమునఁదనకునెవ్వరు ♦ సాటియనుచు
విఱ్ఱవీగుచునుండెనా ♦ వీరవరుఁడు. 55

వ. ఇట నాకృష్ణరాజబిడౌజుని యక్షయప్రోత్సాహంబునఁ గా
మానాయకుండు. 56

ఉ. కాలకృతాంతుఁడై యడరి ♦ కాలకృశానులఁబోలువీరులన్
వేలకొలందిఁదీసికొని ♦ వేఁజనికోటనుఁజేరఁబోవఁగాఁ
దాళఫలంబులంతటివి ♦ దారుణగోళములంఫిరంగులన్
గాలిచిరారిపుల్గడువి ♦ కావికలైచనఁగృష్ణసైనికుల్. 57

ఉ. అప్పుడునాయకాగ్రణి మ ♦ హార్భటిసేనకుఁజేయివీచి నే

ర్చొప్పఁగముందుకుండటిమి♦ యొక్కమొగిన్వడిఁద్రోచిపోయి
[నన్
దప్పెనుముప్పుగుండులవు ♦ ధాఁగడుమీఁదుగఁబోవనిట్టులా
నిప్పులవానకుందొలఁగి♦నిల్చెబలంబులుగొంతఁదేరుచున్. 58

ఉ. పిమ్మటనాయకుండడరి ♦ పేర్చుచుపౌజులనాలుకొల్పినన్
హుమ్మనిమీఁకిపొక్కటమ♦హోగ్రతఁగోటనుముట్టువేడుకన్
గొమ్మలనుండివైరులతి ♦ కోపమునన్శిలలుందుపాకులా
క్కుమ్మడిబుఱ్ఱికాల్చిరిప్ర♦యోగకళానిపుణత్వమేర్పడన్. 59

ఉ. దానికిఁగృష్ణసైనికులు ♦ దల్లడమందియుద్రావిరాలియున్
మానమునూఁదివప్రమున ♦ మానుషరీతినిడాసియశ్మముల్
పూనిపెకల్చసాగిరరు ♦ లుంగడునల్గిభయంకరోద్ధతిన్
బాణశిలాప్రవర్షములఁ ♦ బాయకనొంచికలంచిరెంతయున్.

ఉ. ఆయవనప్రతాపమున ♦ కాఁగకవెన్కకు వచ్చుసేనలన్
రాయలుగాంచి యుగ్రుఁడయి ♦ రాష్ట్రహితంబునఁ బ్రాణ
[దానమున్
జేయనిపంద లేలయుని ♦ చివ్వకువేఁబురికొల్పెవారలా
దాయలకోటపైనడరి ♦ దారుణవృత్తినిఁ బోరిరుద్ధతిన్. 61

గీ. కడఁకనిట్టులు ముట్టిపె♦కల్చికోట
రాలఁదెచ్చెడు వీరులఁ ♦ జాలమెచ్చి
తగిన బహుమతులిచ్చియు ♦ త్సాహపఱిచి
పంపుచుండిరి నాయకుల్ ♦ ప్రభువునాజ్ఞ. 62

గీ. మూఁడుమాసంబులిట్టులు ♦ ముట్టడించి



పోరుచుండఁగనృపతికిఁ ♦ జారుఁడొకఁడు
దెలిపెఁగృష్ణకునావలి ♦ తీరమందు
వచ్చివిడిసెబిజాపురి♦వాఁడటంచు. 63

గీ. తెలుపవేగులవారినిఁ♦బిలువనంపి
శత్రునొక్కొక్కచర్యను ♦ జక్కనెఱిఁగి
వచ్చియెప్పటిదప్పుడు ♦ వరిదిసెప్ప
నుత్తరవుసేసి నరపాలుఁ♦డోర్చియుండె. 64

గీ. అంతనచ్చటనెదులుపా♦యాప్తవరులఁ
బిలిచితనశత్రునెలవును ♦ వీడిరాని
కతమునుగురించియడుగనా♦ఖానుమణికిఁ
దెలిపెనంకుసఖానుఁడన్♦ధీయుతుండు. 65

ఉ. దేవరసేనలంగలిసి ♦ తెంపుననీనదిదాఁటునత్తఱిన్
లావునుజేవయున్నెఱప ♦ లక్ష్యములోఁగొనియుండునంచునే
భావనసేసెదన్మఱియు ♦ వాఁడెపయింబడివచ్చునంతకున్
గేవలముందటస్థముగ ♦ నిల్చుటసేమమటంచునెంచెదన్ 66

గీ. అనినఁదక్కినసరదారు ♦ లతనిమాట
పాటిగాఁగొనఁదగదని ♦ పలికిరిట్లు
విషయవాసనలన్జిక్కి ♦ వికలుఁడైన
పతికినుతులకునుబ్బెడు ♦ పతితమతికి. 67

ఉ. కాఫురులెన్నఁడేనిమన ♦ ఖడ్గపుధాటికినిల్చిగెల్చిరే
దాపునఁజేరివచ్చుటకు ♦ ధైర్యముచాలకడాఁగినట్టియీ
పాపినిఁబెద్దసేయుటిది ♦ పాడియెమీఁదియగల్గఁజూడుఁడీ

సాపుగఁ జేసివచ్చెదము ♦ శత్రులనెవ్వరుసాటిమాకిలన్. 68

సీ. అనినవారలమెచ్చి ♦ యయ్యవనీశుండు
సేనలన్నియులెక్క ♦ సేసిచూచి
వందయునేఁబది ♦ వారణరాజముల్
నూటయిర్వదివేల ♦ మేటిభటులు
పదునెనిమిదివేల ♦ పటుఘోటకంబులు
జంగుఫిరంగులు ♦ చాలఁగలుగు
ఔజేఁగియుద్ధంబున ♦ నీశతఘ్నులెచాలుఁ
బరిపంథిబలముల ♦ భంగపఱుప
నంచుదృఢముగనమ్మివే ♦ యించెభేరి
రేపకడనదిదాఁటంగఁ ♦ జాపధరులు
హరులుగరులునుసర్వసై ♦ న్యములుసకల
పరికరంబులతోఁగూడి ♦ దరినినిలువ. 69

గీ. అంతనారాత్రిఖానుండు ♦ నతనివారు
దప్పఁద్రాగివివేకంబు ♦ దప్పితూగి
తూలిసోలుచువెలయాండ్ర ♦ తోడఁగూడి
తిట్లతిన్నులలోమున్గి ♦ తేలిపడిరి. 70

వ. అప్పుడు. 71

గీ. నింగిపై నుండి వారినిఁ ♦ దొంగిచూచి
పక్కుమనినవ్వె నోయనఁ ♦ బద్మవైరి
వెన్నెలనుగాసెనామీఁద ♦ విసికెననఁగ



వెల్లఁబాఱెను దూరుపు ♦ తెల్లవాఱె. 72

వ. తదనంతరంబ. 73

గీ. మానినీమణులనుమాటి ♦ మఱచిపోయి
ధనమునాశించి తమమాన ♦ ధనము నాశ
పఱిచికొనుపడుపుఁగత్తెల ♦ పాటుఁజూచి
మండుచును వచ్చెనాభాస్క ♦ రుండుదోఁచె. 74

ఉ. అంతసమస్తసేననది ♦ నద్భుతరీతిఁదరింపఁజేసి దు
ర్దాంతములౌశతఘ్నులను♦దర్పముమీఱఁగముందుఁగూర్చియా
వంతయపాయముల్ గలుగ♦నట్టులగట్టలుదీర్చిఫౌజులన్
జెంతలఁబొంతలన్ జలము♦చేరువఁజేర్చినవాబెలర్చినన్. 75

ఉ. కృష్ణవిభుండెఱింగిలయ♦కీలిగమండుచుదండనాథులన్
గృష్ణసమానశూరులన ♦ కేసరులందమవాహినీలతో
నుష్ణకరోగ్రతేజమున♦నుజ్జ్వలవృత్తినిఁబోవఁగొల్పియ
త్యుష్ణప్రతాపమేర్పడమ ♦ హోద్ధతివెంటఁజనెన్ ధణార్భటిన్.

వ. ఇట్లురభసోద్రేకంబులంజని శత్రునకుసార్ధక్రోశంబునం దండువి
డిసినాఁడు శుక్రవారంబగుటసన్నాహంబులం గాలంబువుచ్చి
మఱునాటిసూర్యోదయావసరంబునసంగరభేరిమ్రోయించిన.

క. భూరిభయంకరహేషలు
వారణఘీంకారములును ♦ బటహహుంఘుకా
దారుణరవములుగర్ణవి
దారణనిస్స్వాణధాణ ♦ ధణములు సెలఁగెన్. 78

ఉ. భీషణఘోషణంబులకు ♦ భీతిలిపక్షులుగూలెనేలపై

భాషణముల్వినంబడమి • భావమునన్నలఁజూపనయ్యె వి
ద్వేషులమీఁదిరోషమున • వీరులురోజెదొడంగిరుద్ధతిన్
ఘోషకుఁడైనకృష్ణవిభు • పూనికిఁదీర్పఁగదూఁకెసైన్యముల్.

గీ. రణసమర్థుఁడుకృష్ణభూ • రమణుఁడంత
నేఁడు మొనలుగ సేనల • నెలమిఁదీర్చి
ముందునొక్కటిరిపులను • ముట్టఁగొలిపె
రంగపురివానినాయకా • గ్రణిగఁజేసి. 80

ఉ. అప్పృథివీంద్రమౌళిమణి • యానతి రంగపురీశుఁడంతటన్
ముప్పదివీరపుత్రులు ప్ర • మోదముమీఱఁగఁదన్నుఁగొల్వగాఁ
దెప్పరమైన వేగమునఁ • దీక్ష్ణతరంబగు శౌర్యధైర్యముల్
చొప్పడఁబోయితాఁకెరిపు • శూరులుబెగ్గిలఁ గృష్ణుఁడార్వఁగన్

ఉ. తాఁకితటిల్లతాభమయి • తళ్తళలాడెడువాడికత్తితో
వీఁకదళమ్ములన్ జమరి • బెబ్బులిపోలికబొబ్బవెట్టుచున్
దాఁకినవారి శీర్షముల • ధాటునడొల్లగవేసియార్చుచున్
భీకరనృత్తివైరులను • భీష్మునిమాడ్కిఁగలంచుచుండఁగన్.82

ఉ. ఇవ్విధిఁబోరు తండ్రికిఁబ • దింతలుమీఱినపుత్రులార్భటిన్
దవ్వులదవ్వులన్ రిపుల • దర్పమడంచుచునేర్పుఁజూపుచున్
జివ్వకునెత్తివచ్చినవి • చిత్రపరాక్రమమూర్తులోయనన్
గవ్వడిమించుశౌర్యమును • గన్గొనఁజేయుచునుండిరంతలోన్.

ఉ. పొంగుచువచ్చిసంద్రమును • బోలుచువారిబలంబులొక్కటన్
దుంగపరాక్రమంబునఁబ • తుల్దము మెచ్చఁగవైరిమూఁకకున్
భంగముగొల్పెనంతనర • పాలుఁడువేఱొకసేనఁదోడుగా



సంగరభూమికింబనిచె • సాగెనురెండునుగూడిముందుకున్.84

ఉ. అప్పుడుమ్లేచ్ఛనాథుఁడుభ • యంకరమైనఫిరంగులొక్కటన్
జప్పునఫెళ్ఫెళంగురిపి • సంభ్రమమొప్పఁగనార్చిపేర్చినన్
గుప్పలుగుప్పలైపడిరి • కూలిరిరాలిరిశౌర్యధైర్యముల్
దప్పిరికృష్ణసైనికులు • దాళకవెన్కకుఁబారిరార్తులై. 85

ఉ. నిప్పులవానకిప్పగిది • నిల్వకపారెడుకృష్ణుసేనలన్
ముప్పులముంపమ్లేచ్ఛులస • మూహములార్భటిశస్త్రహస్తులై
గొప్పచుగొప్పచున్నఱియు • రోషముమీఱఁగరుద్రమూర్తులై
చెప్పఁగరానిచిత్రవధ • సేయుచునంటిరివెంటమంటలై. 86

వ. ఇట్లు తఱిమికొనివచ్చుచుండు మ్లేచ్ఛులక్రౌర్యంబును దన వారిదైన్యంబునుంగాంచి రోషావేశపరవశుండై యక్కృష్ణరాజకంఠీరవుండు గన్నులెఱ్ఱఁజేసికొని పటపట పండ్లుగొఱుకుచు.

గీ. నేఁడుకర్ణాటలక్ష్మికి • నేతయగుచుఁ
గ్రాలురారాజుమ్లేచ్ఛుల • రాజుకోడి
పఱచెననువార్తపుట్టదు • బవరమందు
బ్రాణములవేల్చులేక దా • వైరిఁగెల్చు. 88

చ. అనితరవేలియుంగరము • నప్పుడతీసియెమాత్యహస్తమం
దునిచిమదీయప్రాణములు • యుద్ధములోపలఁగోలుపోయినన్
ఘనతరకేలలంబడఁగఁ • గాంతలకియ్యదిచూపితెల్పుమం
చనివినిపించివీరులన • హార్పతి తేజులఁగాంచియిట్లనెన్. 89

ఉ. ఎన్నిటికింకమీపరువు • లెన్నటికేబలపౌరుషంబులున్
బన్నముగాంచియుంబ్రదుక • ప్రాణములక్కటయంటిలీపుతే

తన్నుఁడు వైరిజాలములఁ ♦ దర్పముఁ జూపుఁడు రండు శూరులై
సన్నుతకీర్తిలక్ష్మికిని ♦ సంతసము సేయుఁడు విక్రమంబులన్. 90

చ. అనితురగంబు నెక్కి తన ♦ హస్తమునందుఁ బ్రశస్తఖడ్గమున్
గొని తనువుముందుఁ బోవరణ ♦ కోవిదులందఱు నొక్కపెట్టునన్
ఘనతరకోపవేగమునఁ ♦ గాలకృశానులు వోలె మండుచున్
జనిరిపుజాలముం జెమర ♦ సాగిరి క్రూరకృపాణపాణులై. 91

వ. మఱియు. 92

ఉ. ఎక్కడఁ జూచినం దలలె ♦ యెక్కడఁ జూచినఁ గాలుసేతులే
యెక్కడఁ జూచిన న్నెదడె ♦ యెక్కడఁ జూచిన నాంత్రజాలమే
దక్కమ తేమిగానని వి ♦ ధమ్మున దారుణవిక్రమోద్ధతిన్
జెక్కుచుఁ బోవుచుండిరి వి ♦ చిత్రగతిన్ రిపులన్నుతారులై. 93

ఉ. మ్లేచ్ఛులనివ్విధిం గరుణ ♦ లేశము లేక భయంకరంబుగా
స్వచ్ఛపరాక్రమంబున య ♦ శంబును గోరి నృపాలునానతిన్
స్వేచ్ఛగ నూడ్చికొంచుఁ జను ♦ కృష్ణునివాహినికడ్డకట్టగా
వచ్చి యెదిర్చె సల్బతను ♦ వాఁడు పరాక్రమరేఖ శోభిలన్. 94

గీ. ఏనువందల పోర్చుగీ ♦ స్సేనఁగలసి
సైంధవునిఁ బోలె వేఁడిగల ♦ సైంధవంబు
నెక్కి ఖడ్గంబు పూని పెం ♦ పెక్కియట్టు
లడ్డముగవచ్చి చమరెడు ♦ నరిని జూఁచి. 95

గీ. పార్థుమించిన శూరులు ♦ పల్వురొక్క
పెట్టుచుట్టును ముట్టియే ♦ తట్టుఁ బోవ
కుండగుఱ్ఱముఁ దెగటార్చి ♦ యుగ్రభటుల



ఖండతెనిద్రుంచి చెఱఁగొని ♦ రంతనతని. 96

వ. అప్పుడు కృష్ణపార్థివుం డవ్వీరవరుల యవక్రపరాక్రమం బెంతయు నుగ్గడించి వైరిసేనానికాయంబులకుం గడుంగనలి. 97

ఉ. కుంజరయూథమున్ మఱియు ♦ గుఱ్ఱపుదండులఁ గొల్చి కొల్పినన్
భంజన సేయుచున్ జనెఁ బ్ర ♦ భంజనవేగమునన్ హరీంద్రముల్
పింజలుగాఁగ నేకుచరి ♦ భీకరముల్ కడు లేఁగెరంగ మా
నంజుడునంజడౌచు నయ ♦ నంబులకున్ వెగటయ్యెఁ జూడఁగన్

వ. అంత. 99

ఉ. సేనలనివ్విధిన్ హతము ♦ సేయుచువచ్చెడు కృష్ణుధాటికిన్
మానసమందు భీతిల్లి ప్ర ♦ మాదము వచ్చునటంచు మంత్రితో
నేనుఁగుపై సవారియయి ♦ యేటిని దాఁటి యథేచ్ఛఁ బోయె సే
నానులు పౌజులున్ గడున ♦ నాథలుగా యవనేశుఁ డార్తుఁడై. 100

వ. మఱియు. 101

ఉ. కృష్ణుని ధాటిపైఁబైని ♦ గృష్ణను జేరుచువచ్చునంతన
త్యుష్ణపరాక్రమంబునకు ♦ నోర్వఁగఁ జాలక వైరిసేనలా
కృష్ణను దాఁటిపోవుతఱిఁ ♦ గేలనుబట్టి విదిల్చి వారలన్
గృష్ణుని సేనలోపలి మ ♦ దేభము లెంతయుఁ జీల్చెఁ గ్రూరతన్

వ. అదియునుంగాక. 103

గీ. వానిపైనుండి విలుకాండ్రు ♦ వంగివంగి
నీటిలోఁ బోవువారిని ♦ నిక్కిచూచి
కలుకుటమ్ములగుడి పెట్టి ♦ గాడ సేసి
యంతకంటెను ఘోరమ్ము ♦ లగుపఱచిరి. 104

వ. అప్పుడు. 105

గీ. కృష్ణభూవిభు తేజంబు ♦ నుష్ణకరుఁడు
చూచిభయపడిపరువెత్తి ♦ చూపుమేర
దూరమునఁదొంగిచూచుచుఁ ♦ దొలఁగితొలఁగి
యంతు తెలియకపోయెనా ♦ నస్తమించె. 106

వ. మఱియు. 107

గీ. కఠినముగనట్లుపోరెడు ♦ గతినిఁజూచి
కృష్ణకృష్ణునిపైఁజాల ♦ కినిసెననఁగ
నెఱ్ఱఁగాఁబారెనెత్తుఱు ♦ నేరుగలిసి
ఘోరతరరూపమైతోఁచెఁ ♦ బోరుచూడ. 108

వ. అంత. 109

క. పరమదయాజలనిధియా
ధరణీశుఁడనాథమైన ♦ దాయసేనపైఁ
గరుణించితనబలమ్ముల
మరలించెనుగృష్ణునకుస♦మానులుగలరే. 110

ఉ. ఆఁపెరణంబుదీనులకు ♦ నాపదవాపెనుమ్లేచ్ఛుఁడైనయా
పాపినెపమ్మునన్ బ్రజకు♦వాటిలెదుఃఖమటంచుఁబొక్కెఁదాఁ
జూపెనుగౌరవంబునని ♦ శూరతఁజూపినవారికెంతయున్
మాపెనుమ్లేచ్ఛభీతిమఱి♦ మానముగూరిచెనార్యజాతికిన్

వ. మఱియు. 112

ఉ. నాల్గుగువేల గుఱ్ఱములు ♦ నాలుగువందల జంగ్పిరంగులా
భీలశతేభముల్మఱియుఁ ♦ బెక్కుగుడారములాన్నృపాలుఁడా



యాలమునందుఁ గొల్లగొని♦యార్తుల వృద్ధులస్త్రీల బిడ్డలన్
జాలినివారిపట్టులకు ♦ జాగొనరింపకపంపె నంతలోన్ 113

సీ. యవనాపజయమున ♦ నలరిదేవేంద్రుండు
వెల్గించినట్టిది ♦ వ్వాయయనంగ
విజయపురీంద్రుని ♦ విమలమైయొప్పారు
మూర్తీభవించిన ♦ కీర్తియనఁగ
గగనకల్పకమునఁ ♦ గలిగిపక్వంబయి
భాసిల్లునమృతంపు ♦ ఫలమనంగఁ
జీఁకటులనుసోఁకు ♦ మూఁకలఁజెండాడ
సర్వేశుఁడంపిన ♦ చక్రమనఁగఁ
బొడిచెదూప్పనరజనీవి ♦ భూషణుండు
దాహశాంతుండుతారామ ♦ నోహరుండు
గురునిమించినకాంతినిఁ ♦ గుల్కుచుండు
పూర్ణచంద్రుండుభువనస ♦ మ్మోహనుండు. 114

వ. ఇట్లు శాలివాహనశకమందలి 1443 వ వర్షంబగు విక్రమ సంవత్సరంబున జ్యేష్ఠశుద్ధపూర్ణిమా స్థిరవాసరంబున నవక్ర పరాక్రమ విక్రమార్కుం డగునకృష్ణరాయ సార్వభౌముండు యవనపతియగు బిజాపురీశుని నోడించి తదవసరంబున వీరస్వర్గంబుగాంచిన వీరవరులకందఱికి నుత్తరక్రియలుగావించి యనంతరంబ ప్రచండతర వేగంబునమరలరాచూరుం జేరి.

ఉ. కోటనుముట్టడింపఁబురి♦కొల్పెను సేనల వారలొక్కటన్
మేటిమగంటిమిన్ శిలల♦మీటి పెకల్చఁగసాగిరుద్ధతిన్

దీటుగమీఁదినుండిరిపు♦ధీరులుఘోరశరప్రవర్షముల్
మాటికిమాటికింగురిపి ♦ మాపుచుచుండిరి వీరిదర్పముల్. 116

గీ. దానికోర్చుకొనుచుఁ ♦ దమపట్టుసాధింప
రేయుపగలువీరుఁ ♦ బాయకుండఁ
గృష్ణభూపునాజ్ఞ♦నెలమితోఁబాలించు
చుండిరద్భుతముగ♦నుక్కుమెఱయ. 117

గీ. ఇట్టులిరువది దివసమ్ము♦లేకరీతి
ఘోరముగఁబోరుచుండియుఁ♦గోటగొనుట
సాధ్యముగఁదోఁచకుండిన ♦ సార్వభౌముఁ
డొక్కవిధముగఁజింతించు♦చుండునంత. 118

వ. ఆరాజేంద్రునిదర్శింపవచ్చి యతనిమన్ననలం బడయుచుండి
న పోర్చుగీసురాయబారియగు 'ఫీగొరీడో' యబ్బానాథుని
యవలోకించి యింగితజ్ఞుండు గావునవిట్లనియె. 119

క. మీవారుపోరుచుండఁగ
మావారిటనూరకుంట ♦ మర్యాదయెయో
దేవరయాజ్ఞాపించిన
సేవకులొకయింతపనికిఁ ♦ జెల్లరెయనినన్. 120

వ. అక్కృష్ణరాజేంద్రుండు. 121

గీ. మదినిసంతసించి ♦ మన్నించియాతని
మీకుఁదోఁచినట్లు ♦ మెలఁగుఁడనినఁ
బంచె 'ఫీగురీడొ' వందసిపాయీలఁ
బొంచికాల్చియరుల ♦ పొంకమడఁప. 122



వ. ఇట్లు పంపినవారు సంభ్రమోత్సాహంబులతోఁ గృష్ణసైని
కులంగలిసి చక్కఁగగురిపెట్టి కోటకొమ్మలవెంటఁదిరుగులాడు
చుండు మ్లేచ్ఛులనవలీలం బడఁగొట్టుచుండిరి. 123

గీ. ఇట్లువారుదుపాకీల ♦ నెక్కుపెట్టి
మీఁదియవనులఁగడతేర్చి ♦ మెలఁగుచుండఁ
గృష్ణసేనలుగోడల ♦ నెలమిఁగూల్చె
భీతిలేకుండఁబటికి సం♦ప్రీతినిండ. 124

వ. ఇట్లక్కృష్ణసైనికులు పోర్చుగీసుసిపాయీల సహాయంబునను
దమప్రభువుయొక్క ప్రోత్సాహంబునను ప్రథమప్రాకారం
బుసాధించి ద్వితీయప్రాకారంబున కడరునంత నక్కోటలోని
సేనానాయకుండు దమవారల నట్లుగురిపెట్టికాల్చువీరుల న
వలోకించుతమకంబున మీఁదినుండితొంగిచూచిన. 125

గీ. తట్టుమనికొట్టిపడవేసి ♦ ధైర్యరాశి
పోర్చుగీసుసిపాయిదా♦నార్చెనంత
మెచ్చిరందఱునాతని♦మేటిగురికిఁ
బిచ్చలించిరిలోపలి ♦ వీరులెల్ల. 126

గీ. అంతమఱునాఁటియుదయాన ♦ నార్తులగుచుఁ
బౌరులొకతెల్లటెక్కెమ్ముఁ ♦ బట్టిచేతఁ
గావుమనిచేతులెత్తుచు ♦ గర్వముడిగి
వచ్చి కాంచిరికృష్ణభూ♦పతినిహితుని. 127

ఉ. వచ్చినవారిఁగృష్ణుఁడు న♦పారకృపారసపూరితంబులై
విచ్చినపుండరీకముల ♦ వీఁకను బోల్చెడుకన్నుదోయితో

మచ్చికమీఱఁజూచియను ♦ మానము లేక మెలంగుఁజెల్లి నే
వచ్చెదఁగోటలోనికిశు ♦ భంబులుగూర్చెదనంచుఁ దెల్పిరన్.

గీ. వారలానందవార్ధిలో ♦ పలను దేలి
యెంతకరుణానిధానమీ ♦ కాంతుఁడనుచు
నర్థిసాష్టాంగదండమ్ము ♦ లాచరించి
వెళ్లి కృష్ణునిరాకకై ♦ వేచియుండ. 129

వ. మఱునాటిసూర్యోదయానంతరంబున నప్పురుషోత్తముండు.

ఉ. మంగళవాద్యముల్సెలఁగ ♦ మాగధపాఠములుల్లసిల్లఁగాఁ
దుంగపరాక్రమంబునకుఁ ♦ దోడుదయారసమొల్కుచుండఁగాఁ
బొంగుచుఁగోటలోపలికిఁ ♦ బోయి ముదంబునఁ దెల్పిపౌరులన్
భంగములెవ్వియుంబ్రజకు ♦ వాటిలకుండఁగఁ జేసియంతటన్.

గీ. పురనివాసులలోబిజా ♦ పురికి నేగఁ
గోరువారినిఁబంపెను ♦ దారుఁడగుచు
దారిబత్తెమ్ములనుగీడు ♦ వారికేమి
మూడకుండఁగరాతుల ♦ తోడునొసఁగి. 132

వ. తదనంతరంబ. 133

ఉ. ఇట్టికృపాసముద్రముమ ♦ ఱెక్కడఁగల్గునటంచునందఱున్
బట్టగరానిసంతసపు ♦ పొల్కడలిన్ గడుఁదోఁగుచుండఁగాఁ
గిట్టనివారుఁగూడఁ దన ♦ కీర్తినిగీర్తనసేయుచుండఁగాఁ
బట్టణమెల్లస్వర్గముగ ♦ భాసిలుచుండఁగనుండిమీఁదటన్. 134

ఉ. కోటనుజక్కఁజేసి పడఁ ♦ గొట్టినవానినిబాగుఁజేసియా
వీటనుమేటినాయకుని ♦ వీరునినొక్కనిఁగాపుపెట్టియా



రాటములేనిచిత్తమున ♦ రాజమహేంద్రుఁడు కృష్ణరాజు దా
వీటినిఁ జేరఁబోయెఁగడు ♦ వేడుకమీఱఁబ్రసన్నమూర్తియై. 135

వ. ఇట్లు విజయసంభ్రమసంరంభంబులతో విజయనగరంబు
సమీపించియొక నాటిసాయంసమయంబున. 136

సీ. దీపమాలికలచే ♦ దేదీప్యమానమై
దివ్యధ్వజంబులఁ ♦ దేజరిల్లి
చారురంభాస్తంభ ♦ సౌందర్యకలితమై
సురుచిరసుమదామ ♦ శోభితమయి
చందనాగరుధూప ♦ సంవాసితంబయి
మంగళవాద్యస ♦ మ్మానితమయి
ప్రతిమందిరంబును ♦ భార్గవీగృహమయి
రాజిల్లఁబురిలోని ♦ రమణులెల్ల
సౌధాళిపైనుండి ♦ జేలజేలపువ్వులఁ
బోరిఁబోరిఁగురిపించి ♦ పొంగుచుండఁ
బ్రజలు కౌతుకముతోఁ ♦ బలుమాఱువీక్షించి
యానందమునఁ దేలి ♦ యాడుచుండఁ
బలుతెఱంగులమతా ♦ బాలు వెల్గుచునుండ
బలసిసామంతులు ♦ గొలుచుచుండఁ
జతురంగబలములు ♦ సైన్యాధిపతులతోఁ
జెలఁగిముందును వెన్క ♦ మెలఁగుచుండ
విజయదుందుభినాదంబు ♦ వెలయుచుండ
విజయనామముగలభద్ర ♦ గజము నెక్కి

విజయనగరంబులోనికి ♦ వేడ్కవచ్చె
విమలతరకీర్తి శ్రీకృష్ణ ♦ విజయమూర్తి. 137

వ. ఇట్లు రాజకంఠీరవుండు మహేంద్రవైభవంబునఁ బురంబుఁ
బ్రవేశించి విజయవిలాస భాసురంబై యొప్పారు రాజభవనం
బుఁదరియఁజొచ్చి వివిధాలంకారంబులవిలసిల్లు తనసతీలలా
మంబులొసంగిన మంగళనీరాజనంబుల నంగీకరించి యంతః
పురంబు సేరి మహానందంబున నారాత్రిగడపి మఱునాటి
సూర్యోదయావసరంబున. 138

సీ. విజయంబుఁగూర్చిన ♦ విశ్వమోహనువిష్ణుఁ
బ్రవిమలమైనట్టి ♦ భక్తిఁగొల్చి
సామంతవరులను ♦ సద్బంధుజనులను
సైన్యాధిపతులను ♦ సత్కరించి
దీనులననదలఁ ♦ దృప్తులఁగావించి
కవిబుధేంద్రులనెల్ల ♦ గౌరవించి
పోర్చుగీస్వారిని ♦ భూషణాచ్ఛాదన
ములఁజాలమన్నించి ♦ ముదముఁగూర్చి
సతులభృత్యులనానంద ♦ జలధిఁదేల్చి
పూజ్యకర్ణాటలక్ష్మికిఁ ♦ బొలుపునించి
జయమహోత్సవమొనరించి ♦ సంతసించెఁ
జారుతరకీర్తి శ్రీకృష్ణ ♦ చక్రవర్తి. 139

సీ. జయమహోత్సవమిట్లు♦సలిపిసంతోషానఁ
బ్రజలఁబాలించునా ♦ పార్థివునకుఁ



దనసతీరత్నంబు♦దనయునొక్కనినిచ్చి
పుత్రోత్సవంబునఁ ♦ బొంగఁజేసె
నంతశూరులుదారు♦లగు రామతిరుమల
రాయలకిబ్భువి♦రామలక్ష్మ
ణులఁబోలు నన్నద♦మ్ములకుసంప్రీతితోఁ
దనపుత్రికలనిచ్చి ♦ తగువిధముల
సాటిలేనట్టివైభవ♦సంభ్రమములఁ
బెండ్లిసేసెను ముదమున ♦ బీదసాద
లందఱినిఁదన్పెబంధుల ♦ నాదరించె
జనకసన్నిభుఁడాకృష్ణ♦జనవిభుండు. 140

సీ అంతనాపురమున ♦ నతివిచిత్రంబగు
విఠ్ఠలాలయమును ♦ వెలయఁజేసె
నొకబండనంతను ♦ నుగ్రనృసింహావి
గ్రహముగాఁదొలిపించి♦క్రాలఁజేసె
'పాంజె' నాఁబడుగొప్ప ♦ పోర్చుగీస్ శిల్పి చేఁ
గట్టించెవరతటా ♦ కంబునొకటి
తుంగభద్రకురెండు ♦ దొడ్డకాల్వలఁద్రవ్వి
ధరణినిసారవం ♦ తమునొనర్చెఁ
బంటలోనెనిమిదవవంతు ♦ పన్నుగొనుచుఁ
బ్రజలకెల్లనుదండ్రిగాఁ ♦ బరిణమించెఁ
గరుణలోరామచంద్రుని ♦ సరణిమించెఁ
బుణ్యచరితుఁడుశ్రీకృష్ణ ♦ భూమిధవుఁడు. 141

సీ. ఇట్లు దేశక్షేమ ♦ మెలమిఁ గూర్చుచునుండఁ
గల్బరిగినవాబు ♦ గర్వమెచ్చి
తన్నెదిరించిన ♦ దండిదండులఁ గూడి
దండధరోద్దండ ♦ ధాటి మెఱయఁ
జనియాపురంబును ♦ జర్జరితంబుగాఁ
జేసి యాఖలుని ని♦ర్జించివాని
జ్యేష్ఠపుత్రుని రాజ్య ♦ సింహాసనంబుపై
నారూఢుగాఁ జేసి ♦ యతనివలన
నతులమణిభూషణాదిస ♦ త్కృతులనుతులఁ
బొందితనవెంటఁ దక్కిన ♦ పుత్రవరులఁ
దెచ్చిమన్నించి పాలించె ♦ దేవరాయ
వంశమణియగు నాకృష్ణ ♦ పార్థివుండు. 142

వ. తదనంతరంబ. 143

సీ. అధికవైభవమున ♦ నాఱేండ్లతనపుత్రుఁ
బట్టాభిషిక్తుఁగాఁ ♦ బ్రబలనిచ్చి
యతనికి మంత్రిగా ♦ నాప్తుఁ దిమ్మరసునిఁ
జేసిన యాతండు ♦ చెఱుపుగోరి
తనయుని బ్రేరణం ♦ బున రాచబిడ్డనిఁ
జంపించె విషమిడి ♦ చెనదునాక
యదియెఱింగి మహాగ్ర ♦ హంబున వారలఁ
జెఱఁబెట్టి మఱియును ♦ జేటువలఁప
నెనరులేనట్టి వారిపైఁ ♦ గినుక పొడమి



కన్నులను బెఱికివేయించెఁ ♦ గఠినవృత్తి
దుష్టశిక్షణధర్మము ♦ దొరలకంచు
న్యాయశీలుఁడు శ్రీకృష్ణ ♦ రాయనృపుఁడు 144

వ. ఇట్లు యథాన్యాయంబుగ రాజ్యంబేలుచుండి. 145

సీ. లలితంబుగా మదా♦లస చరిత్రంబును
బ్రీతిసత్యావధూ♦ప్రీణనంబు
సరసమైయొప్పెడు ♦ సకలకథాసార
సంగ్రహంబును మరిఁ ♦ జారుఘణితి
జ్ఞానచింతామణి ♦ జ్ఞానపుంజంబును
మానితమారస ♦ మంజరియును
గవులకాహ్లాదమై ♦ క్రాలుచందమ్మున
నింకయు నెన్నేని ♦ నితరకృతులు
దేవభాషను వ్రాయఁగాఁ ♦ దేరినట్టి
ధీనిఁ బ్రకటించు విష్ణుచి ♦ త్తీయమనెడు
నాంధ్రకావ్యంబు రచియించి ♦ యమరుఁడయ్యెఁ
గృష్ణరాజకవీంద్రుఁడు ♦ గీర్తివరుఁడు. 146

గీ. అంతనయ్యాలరాజువం ♦ శాబ్ధిచంద్రు
రామభద్రుని మన్నించి ♦ రక్తిఁ బెంచి
సరససకలకథాసార ♦ సంగ్రహంబు
తెనుఁగు సేయంగఁ గోరెధా ♦ త్రీధవుండు. 147

వ. ఇవ్విధంబున సకలకవిబుధవరుని కరంబులకాహ్లాదంబుగ సర్వ

జనానురంజకంబుగ జగత్సామ్రాజ్యంబుగ రాజ్యంబు సేయు
చుండి. 148

సీ. ప్రతివత్సరముకోటి ♦ పరడావులను జేర్చి
కోశంబువృద్ధికిఁ ♦ గొలిపినాఁడు
పదిలక్షలకుమీఱు ♦ బలము లెప్పుడుఁగూర్చి
పెట్టిశత్రులభయ ♦ పెట్టినాఁడు
జనులమానప్రాణ ♦ ధనముల కాపద
గలుగకుండఁగ నేలఁ ♦ గలిగినాఁడు
మతపక్షపాతముల్ ♦ మఱపియందఱిలోన
నన్యోన్యమునుగూర్చి ♦ యలరినాఁడు
సేతుకృష్ణానదీమధ్య ♦ సీమనెల్లఁ
దనభుజాదండముననిల్పి ♦ ధర్మనిరతిఁ
బాలనము సేసిసత్కీర్తిఁ ♦ బడసినాఁడు
రాజమాత్రుండె శ్రీకృష్ణరాజమౌళి. 149

సీ. జైనమతాచార్యుఁ ♦ డైన దేవేంద్రకీ
ర్తినిసత్కృతులలోనఁ ♦ దేల్చినాఁడు
విమలవిద్యారణ్య ♦ పీఠంపుశ్రీరామ
చంద్రభారతిపూజ ♦ సలిపినాఁడు
వైష్ణవాగ్రేసరు ♦ వల్లభాచార్యుని
మన్నించియొజ్జగా ♦ నెన్నినాఁడు
శైవదీక్షితుఁడని ♦ చాలవాసినిఁగన్న
యప్పార్యునర్చించి ♦ యలరినాఁడు
మ్లేచ్ఛగురులకుమానంబు ♦ లిచ్చినాఁడు
పాదిరీలకునిష్టంబు ♦ పలికినాఁడు



మంచియెటనున్నగ్రహియించి ♦ మించినాఁడు
కృష్ణభూపాలుఁడన నేమి ♦ కేవలుండె. 150

సీ. వీనులవిందుగా ♦ వించుమాటలతోడఁ
చేటవైమించెడు ♦ తెల్వితోడ
గర్వమింతయు లేని ♦ ఘనవర్తనముతోడ
జనకుఁడుమఃదమఁదు ♦ చనువుతోడఁ
బెద్దలు మెచ్చెడు ♦ ప్రీతిభావముతోడ
భద్రమౌశ్రీరామ ♦ భక్తితోడ
నందఱుఁగొనియాడు ♦ నట్టులు మెలఁగఁగాఁ
గలుగుట యేగాక ♦ కైతసెప్పి
చాలమన్ననఁబడయఁగాఁ ♦ జాలెభువినిఁ
బల్లెనుండినకుమ్మరి ♦ మొల్లగూడ
నీప్రభుత్వప్రభావంబు ♦ నెగడుచుండ
నౌరశ్రీకృష్ణకవిరాజ ♦ యాంధ్రభోజ. 151

శా. ఏకచ్ఛత్రముగాఁగ నివ్విధమునం ♦ దేరాజమున్నేలెనే
యేకచ్ఛత్రముగాఁగ నేలెనిలఁబో ♦ యీరీతిఁ జెన్నారెనే
పాకారిందలఁపించు వైభవముతో ♦ భాస్వంతుఁబోల్తేజుతో
శ్రీకారుణ్యసుధాప్రవర్షములతోఁ ♦ జెల్వొకటాళితోఁ.

గీ. అనుచులోకంబునుతియింప ♦ నవని నేలి
శాలివాహనవిఖ్యాత ♦ శకములోని
రామపాండవవేదచం ♦ ద్రయుతవికృతి
వర్షమందలిపూర్వార్ధ ♦ భాగమందు. 152





...విబుధనికరంబు ♦ కల్పతరూయని
...మెచ్చినార్చు ♦ వగచుచుండ
రాణులార్తధ్వని ♦ ప్రాణేశ్వరాయని
యుర్విపైఁబడిమూర్ఛ ♦ నొందుచుండ
హాతండ్రివిఘ్నమునిట్టు ♦ లనదలఁజేసితే
యనిప్రజాతతులంగ ♦ లార్చుచుండ
వైరిరాజులుగూడ ♦ వీరాగ్రణీయని
విలపించియశ్రులు ♦ విడుచుచుండ
గాఢమైనట్టిశోకాంధ ♦ కారమందు
లోకమంతయుమునుఁగనా ♦ లోకబాంధ
వుండుశ్రీకృష్ణసార్వభౌ ♦ ముండుసుప్ర
శస్తవిక్రమసంపన్నుఁ ♦ డస్తమించె.

మాలినీవృత్తము.



అనుపమనగధీరా ♦ అంచితార్థప్రచారా
వినమితరిపువీరా ♦ మీంధర్మానుసారా
ధననిచయకుబేరా ♦ దానరాధాకుమారా
అనఘనయవిహార ♦ ఖ్యాతికృష్ణావతారా.

ఇది శ్రీబుచ్చివేంకయామాత్యతనయ సకలసజ్జనవిధేయ
ఆదిపూడి సోమనాధ నామధేయప్రణీతంబైన
శ్రీకృష్ణదేవరాయ చరిత్రంబునందు సర్వం
బును షష్ఠాశ్వాసము
సంపూర్ణము.



